Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఈత రాక

పంపినవారు :
ఎస్. ఎస్. ఎన్. రావు - కొంతంగి

CP-2

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవన్నీగాక - రంగులబొమ్మ కథ - పైపు చిత్రాలు
ఫొటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

ఆంధ్రదేశమంతటా విజయవంతంగా ప్రదర్శింపబడుతోంది



సారథీ చిత్రం...

# అంతా మనవాళ్లే!

క్రొత్తపోకడలతో నిండియున్న
మహోత్తర సాంఘిక చిత్రం.

దర్శకత్వం... తాపీ చాణక్య. పర్యవేక్షణ.. ప్రసాద్.



: డి స్ట్రి బ్యూ టర్లు :

ఆంధ్ర : ది ప్రీమియర్ ఫిలిమ్స్ లిమిటెడ్, విజయవాడ.
సీడెడ్ : నవయుగ ఫిలిమ్స్, విజయవాడ & గుంతకల్లు
హైదరాబాద్ : ది సుందర్ పిక్చర్స్ సర్క్యూట్, సికింద్రాబాద్.

వివరాలకు : సారథి ఫిలిమ్స్ లిమిటెడ్, మదరాసు - 17

జనవరి 29 మొదలు
ఆంధ్రదేశమంతటా
విడుదల కానున్నది

# రాజీ.

నా ప్రాణం...

అనురాగమూ త్యాగమూ అతిశయించే
అపూర్వమైన కథ...



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

గత నెలలో చేసిన మార్పులు-అనగా పేజీలు పెంచటం, సీరియల్ కథ మూడు రంగులలో ముద్రించటం—ఇవన్నీ మన పాఠకులకు సంతోషాన్ని కలిగించినై. ఈ సంతోషాన్ని తెలుపుతూ వచ్చిన ఉత్తరాలలో ఒకటి ముఖ్యంగా గమనింపతగివున్నది. అందులో— 'చందమామవంటి సంస్థ, పాఠకులకు ఇంకా ఎన్నోవిధాల ప్రోత్సాహమీయవలసి ఉన్నది'... అని కుతూహలాన్ని వెల్లడిస్తూ వ్రాశాడు, ఉత్సాహి ఐన ఒక పాఠకుడు. ఈ వుద్దేశాన్ని నెరవేర్చేటందుకే ఈనెల 'కథల పోటీ', 'వ్యాస రచన పోటీ' అనే రెండు పోటీలు ప్రారంభించాము. ఈ అవకాశాన్ని బాగా వినియోగించుకొని, చందమామ పాఠకులు పుష్టినిచ్చే చక్కటి సాహిత్యాన్ని సృష్టించగలరని ఎంతగానో ఆశిస్తున్నాము.

సంపుటి 14 : ఫిబ్రవరి 1954 : సంచిక 2



# తాతయ్య రైలుప్రయాణం

అవ్వా తాతా అత్యవసరముగ
రైలుప్రయాణం చెయ్యాలి,
పైకంమాత్రం బొటాబొటీగా
ఒక టిక్కెట్టుకె సరిపోయె;
అయితే తాతది అఖండ తెలివి
పరుపుచుట్టలో భార్యను చుట్టి
తొణకక బెణకక రైలెక్కేసి
పరుపును ప్రక్కనె పెట్టి కూర్చొనె.
ఒక స్టేషన్‌లో వచ్చిన ప్లీడరు





చోటులేక మన తాత పరుపును
టాపున పెట్టి ఠీవిగ కూర్చొన
నోరునొక్కుకుని తాత ఊరుకొనె.
మరుక్షణమున నొక సాహెబు వచ్చి
పరుపుచుట్టపై ట్రంకును పెట్టి
బహు ధీమాగా బైఠాయించగ
తాతకు యేమీ తోచకపోయెను.
వెనుకనె వచ్చిన ఒక సినిమా నటి
పరుపుపైన గల ట్రంకుపైనె తన
ట్రంకునుకూడా పెట్టి కూర్చొనగ
తెలతెలపోతూ తాత ఊరుకొనె.
ట్రంకుల బరువుకు తాళగలేక



(గేయ కథ)

గడబిడ చాలా పెరిగింది,
బిగిలూ గంటా వినరాలేదు
గుభి గుభి రైలే వెళిపోయింది.
పరుపే రక్షగ ప్లాట్‌ఫారంపై
అవ్వ సుఖముగా బయటపడింది.
పెట్టెలు తెరవగ నగలూ చీరెలు
నోట్లకట్టలే దొరికాయి!
తాత మూర్ఖమును సహించినందుకు
'తాతి' అదృష్టం పండింది!

పరుపుచుట్టలో వరుగైపోయిన
అవ్వ కొంచెె మటు వత్తిగిల్లగా
తాతయ తలపై తార ట్రంకు పడె.
అత్యుగ్రంబున ఆ ట్రంకును గొని
తాతయ బైటికి విసరివైచెను.
తాతదె అనుకుని సాహెబు ట్రంకును
తార దభీలున బయటికి విసరెను.
సాహెబుకేనా శౌర్యము లేనిది
పరుపునె బైటికి గిరాటువేసెను.
తాతా సాహెబు తార కలబడ
కొరియా యుద్ధం సాగింది.
ప్లీడరుకూడా నోరు చేసుకొన



# అట్టవిూది బొమ్మ

అర్జునుడు తీర్థయాత్రలు చేసుకొంటూ, అనేక ప్రదేశాలు తిరిగితిరిగి, ద్వారక సమీపానికి చేరుకొన్నాడు. ఈ వర్తమానం శ్రీకృష్ణుడికి తెలిసి, వెంటనే అతనికి ఎదురు వెళ్ళాడు.

కృష్ణునికి సుభద్ర అనే చెల్లెలు వున్నది. ఆమెకు తగిన భర్త అర్జునుడే అన్నసంగతి కృష్ణుడికి తెలుసు. ఐతే, అతని అన్న ఐన బలరాముడికి ఈ సంబంధం ఇష్టంలేదు. కాగా, కృష్ణార్జునులు కలసి ఒక తంత్రం పన్నారు.

అర్జునుడు సన్యాసివేషంతో 'రైవతకాద్రి'లో దిగి, మకాంచేశాడు. అతని కీర్తి ఆ ప్రాంతమంతటా ప్రచారమై, బలరామునివరకూ పోయింది. బలరాముడికి సాధువులంటే భక్తిగౌరవాలు ఎక్కువ. కనుక, సపరివారంగా వచ్చి, ఆ సన్యాసిని తోడ్కొనిపోయి, తన ఉద్యానవనంలో ఆయనకు సౌకర్యమైన చక్కటి బస ఏర్పరిచాడు.

అప్పుడు ఆ సన్యాసి 'చాతుర్మాస్యవ్రతం' పట్టాడు. ఆయన సేవకూ శుశ్రూషకూ బలరాముడు సుభద్రనే నియమించాడు. 'సన్యాసుల్ని నమ్మరాదు. సుభద్రను నియమించవద్దుసుమా' అని శ్రీకృష్ణుడు అన్నతో చెప్పాడు. ఐనా, సాధుభక్తి గల బలరాముడు ఆ మాట చెవినిపెట్టలేదు.

సుభద్ర సన్యాసికి పరిచర్యచేస్తూ వుండగావుండగా ఇద్దరిమధ్యనీ పరిచయం దినదినాభివృద్ధిపొందింది. ఆమె అర్జునుణ్ణి ఎన్నోవిధాల మెచ్చుకొంటూ వారి ప్రసంగాలలో వెల్లడించింది. అప్పుడు 'నేనే ఆ అర్జునుణ్ణి' అంటూ రహస్యం చెప్పివేశాడు సన్యాసివేషంలో వున్న అర్జునుడు. సుభద్రకు చాలా ఆనందం కలిగింది.

ఆమె తన మనోభీష్టాన్ని అన్న ఐన శ్రీకృష్ణునికి తెలుపగా, శ్రీకృష్ణుడు వారి రహస్య వివాహానికి ఏర్పాటు చేశాడు. ఆ ప్రకారం, అర్జునుడు ఒక రథం పైన సుభద్రను కూర్చోబెట్టుకొని, ఇంద్రప్రస్థానికి దారితీశాడు.

ఈ సంగతి తెలిసి, బలరాముడు కుపితుడై, అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. వారిమధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఆ సమయంలో శ్రీకృష్ణుడు వచ్చి, అన్నను సమాధానపరిచి, సుభద్రార్జునులకు వైభవంగా పెళ్లి జరిపించాడు.

ఈ సుభద్రకు పుట్టినవాడే భారతవీరాగ్రేసరుడైన అభిమన్యుడు.

# ఇద్దరు విద్వాంసులు

శిఖ్ఖులకు మహాప్రవక్త ఐనటువంటి గురునానక్ సంగీతప్రియుడు. దేవుడిమీద ధ్యానం కుదరటానికి మధురమైన సంగీతమే మంచి సాధనమని నమ్మినవాడు. అందుచేత నానక్ భక్తిభరితమైన గానం చేసి, తరుణోపాయం పొందాలెనని నిశ్చయించుకొన్నాడు.

తన మతప్రచారంకోసం నానక్, రోజుకొక ప్రదేశం సంచారం చేస్తూండేవాడు. ఆ సంచారంలో ఆయనకు సంగీతం వినిపించటానికని భాయ్ మార్దాన అనే గొప్ప విద్వాంసుడు వెంటనుండేవాడు: మార్దాన ఎంతో చక్కగా భక్తికీర్తనలను పాడి, వినేవారికి తన్మయత కూర్చేవాడు.

గురునానక్ ఏర్పరచిన ఈ సంప్రదాయాన్ని శిఖ్ఖుగురువులందరూ అనుసరిస్తూ వచ్చారు. గురువులలో ఐదవవాడైన అర్జునదేవ్ తరంలో, ఆయనవద్ద శాంత, బల్వంత అనే ఇద్దరు విద్వాంసులు ఉండేవారు. ఆ యిద్దరూ అన్నాదమ్ములే.

ఇద్దరూ చాలా కాలం వారి గాన మాధుర్యంతో గురుదేవుడైన అర్జునదేవ్‌నూ, భక్తులందరనూ మెప్పించి, ఎక్కువైన ఆదరం పొందారు.

ఇలావుండగా కొంతకాలానికి విద్వాంసులైన శాంత, బల్వంతులకు పెళ్ళాడుదామని బుద్ధిపుట్టింది. పెళ్ళి చేసుకోవడమంటే మాటలా? బోలెడంత డబ్బు కావాలి. సరే, సోదరులిద్దరూ ఒకనాడు గురువువద్దకు వెళ్ళి, వారి కోరికను వెల్లడించారు. ధన సహాయం కోరారు. ఈ మాట విని అర్జునదేవ్ చాలా సంతోషించాడు.

"ఇంతకంటె నాకు కావలిసిందేమిటి? తప్పక సాయంచేస్తాను. మీకు ఎంత ధనం కావాలో చెప్పండి" అన్నాడు గురుదేవ్. అందుమీదట వారిద్దరూ కూడబలుకుకొని

హరిలాల్



బల్వంతులు భజనకు రాలేదు. అర్జునదేవ్ వారికి కబురంపాడు. 'ససేమిరా, రాము' అన్నారు వాళ్ళు. అలా అని ఊరుకోలేదు. 'మేము చేసే మధురగానంవల్లనే భజనకు ఇంతమంది జనం వస్తున్నారు. మావల్లనే గురువుకూ ఖ్యాతి వస్తున్నది. ఇప్పుడే కాదు. మొట్టమొదటి శిఖుగురువైన నానక్‌కూడా, తన సంగీత విద్వాంసుడైన భాయ్‌మార్దన్ వల్లనే యశస్సు ఆర్జించాడు' అన్నారు.

ఈ ప్రసంగానికి, అర్జునదేవ్ చాలా ఖేద పడ్డాడు. వెంటనే తను శాంత, బల్వంతుల ఇంటికి స్వయంగా వెళ్లి పిలిచాడు. కాని, వాళ్లు గురువుకుకూడా అదే సమాధానం ఇచ్చారు. మహామహుడైన గురు నానక్‌ను కించపరుస్తూ మాటాడటంతో, ఆ సోదరుల మీద అర్జునదేవ్‌కు కోపం వచ్చింది.

"దేవుని స్తుతించటానికి వినియోగించని మీ సంగీత విద్య మీకు పనికిరాకపోవు గాక!" అని శపించివేశాడు. గురుదేవుని వాక్శుద్ధివల్ల అప్పటినుంచీ ఆ సోదరులకు నాలుకలు స్వాధీనం తప్పినై. వాళ్ళు యాతనపడ్డారు. తిండి నోటికి పోవటంకూడా కష్టమైపోయింది.

అక్కడ అర్జునదేవ్—భజనకు వచ్చిన వారందరితో "నిశ్చలభక్తితో దైవప్రార్థన

"గురూజీ!—ఈ రోజు సాయంకాలం భజనసమయంలో భక్తులు అర్పించే ధనం ఇస్తే మాకు సరిపోతుంది" అన్నారు.

వారి కోరికప్రకారం, ఆనాటి సాయంత్రం భక్తులవల్ల పోగైన కానుకలను గురుదేవ్ వారికిచ్చాడు. చూడగా, అనాడు పోగైన ధనం చాలా కొద్దిగా వున్నది. 'ఈ గురుదేవ్ కావాలనే ఇలా చేసివుంటాడు. ముందుగా, ఏదో ఏర్పాటు చేయటంవల్లనే ఇవాళ ఇంత స్వల్పధనం పోగయింది. లేకపోతే ఏమిటి?' అని అపోహపడి, వాళ్లిద్దరూ చిరచిరలాడుతూ భజనకూటంనుండి లేచి వెళ్ళిపోయారు. మరునాడు మామూలు వేళకు శాంత,

చేయండి. మీమీ ఇష్టమైన వాద్యాలు చేత పట్టుకుని కీర్తనలు పాడండి" అని ఆదేశించాడు. ఆ మాటలతో అక్కడ సమావేశమైన అందరూ—ఒక్కొక్కరు ఒక్కొక్క వాద్యాన్ని తీసుకొని, గొంతెత్తి భగవన్నామ స్మరణ ప్రారంభించారు. గురుదేవ్ చెప్పనట్టుగానే, అక్కడ సంగీతం ఏమీ చేతకానివాడు సైతం ఎంతో అద్భుతంగా, అనుభవజ్ఞుడిలాగా పాడగలిగాడు. ఎప్పుడూ చూచి ఎరగని వాద్యాలుకూడా వారు ఎంతో చక్కగా వాయించగలిగారు!

కొంతకాలానికి శాంత, బల్వంతులు తమ తప్పు తెలుసుకొన్నారు. గురుదేవుని ఎదట పడటానికి మొహం చెల్లక, స్నేహితులద్వారా క్షమాపణ చెప్పకొన్నారు. అందుకు గురుదేవుడు ఉగ్రుడై—

'భగవంతుడు ప్రసాదించిన కంఠ మాధుర్యాన్ని, భగవంతునికోసం పాడే గీతాలకు వినియోగించటానికి నిరాకరించిన వాళ్లకు క్షమాపణ యేమిటి? ఇటుపైన ఈ విషయంలో నాతో మాటాడటానికి ఎవరైనా వస్తే, అలాంటివారి ముఖానికి మసిపూసి, గాడిదను ఎక్కించి ఊరేగింపు చేయిస్తా' అన్నాడు.

అర్జునదేవ్ ఇలా అనేసరికి, ఎవళ్ళూ ఎదటికి వెళ్ళలేకపోయారు. ఏమీ లాభం





లేదని తేలిపోగానే శాంత, బల్వంతులు లాహోరు పోయి 'లాధాజీ' అనే మహానుభావుని శరణు చొచ్చారు. లాధాజీ ఆ ప్రాంతంలో పేరు పొందిన పరోపకారి. పరోపకృతికోసం ఎంతటి త్యాగాన్నయినా చేయగల పుణ్యాత్ముడు. ఆ సోదరులు పోయి తమకు కలిగిన పరాభవం చెప్పుకోగానే, లాధాజీకి కరుణ కలిగింది. 'సరే, మీరు వెళ్ళండి. నేను కనుక్కొంటాను' అని చెప్పి వాళ్లను పంపించివేశాడు.

వాళ్ళు వెళ్లగానే లాధాజీ ముఖమంతా మసి పూసుకొని, గాడిదనెక్కి ఊరేగుతూ అర్జునదేవ్‌వద్దకు బయలుదేరాడు. లాధాజీ అమృతసర్ చేరుకొనేసరికల్లా గొప్ప కోలాహలం ప్రారంభమయింది. పురుషులు, స్త్రీలు, పిల్లలూ గుంపులు గుంపులుగా చేరి పెద్ద గోలచేయసాగారు. ఇదేమిటా హడావుడి అని కనుక్కోగా, ఆ వేషంతో వస్తున్న లాధాజీని చూచి అందరూ ఆశ్చర్యపోయి నట్టు తెలియవచ్చింది. వీథులలో ఊరేగుతున్న ఆ మహానుభావుణ్ణి ఈ రూపంలో చూడగానే ప్రజలు విస్మయంతో, పోయి గురుదేవునితో చెప్పారు.

అందరితోపాటు అర్జునదేవునకూ ఆశ్చర్యంకలిగింది. భాయ్ లాధాజీ కనబరిచిన పరోపకారబుద్ధికి అపరిమితంగా సంతోషించాడు. ఆయనకు దర్బారులో సమస్తమైన మర్యాదలూ చేసి, శాంత, బల్వంతులను క్షమించి లాధాజీని సంతోషపెట్టాడు.

ఆనాటినుంచీ శాంత, బల్వంతులు బుద్ధి తెచ్చుకొని, వారి సంగీతప్రజ్ఞను దైవ సంకీర్తనకోసమే వినియోగించి, ధన్యులయ్యారు. నాటినుంచీ మహానుభావుడైన లాధాజీకి 'లాధా పరోపకారీ' అనే బిరుదు సార్థకమై నిలిచింది. శాంత బల్వంతులలో గొప్ప పరివర్తన కలిగింది.





# జ్ఞాతి వైరం

పూర్వకాలమందు కాశీఖండాన్ని ఏలినటువంటి బ్రహ్మదత్తుడికి నూరుగురు కొడుకులు. నూరుగురు కొడుకులలో కడసారివాడు 'సంవరుడు'. తన కొడుకులు ఒక్కొక్కళ్ళను ఆ రాజు ఒక్కొక్క గురువుకు వప్పగించి విద్యలు నేర్పించాడు. సంవరుడి గురువు బోధిసత్త్వుడు.

బోధిసత్త్వుడంటే సామాన్యుడా?— ఆయన మహాజ్ఞాని. రాజపుత్రునికి పితృసమానుడుగా ఉంటూ, కనిపెడుతూ వచ్చాడు. సంవరుడున్నూ గురుభక్తి కలిగి, బోధిసత్త్వుని మాట దాటక నడచుకొంటున్నాడు.

కొంతకాలానికి గురువులందరూ తమ తమ శిష్యులను వెంటబెట్టుకు వచ్చి, 'మహారాజా!—తమ పిల్లవాళ్ళు సకల విద్యాప్రవీణులయారు' అని చెప్పి, రాజుకు వప్పగించి, ప్రభువువల్ల సన్మానాలు పొందారు. కొడుకుల ప్రజ్ఞలకు మెచ్చుకొని రాజు సంతోషించాడు. ఒక్కొక్క కుమారుడికి ఒక్కొక్క రాజ్యం ఇచ్చాడు.

కడసారివాడైన సంవరుడు విద్యలు పూర్తి ఐనతరువాత, గురువును దర్శించి "నా తండ్రి నాకేదైనా రాజ్యం వప్పగిస్తే నే నేంచేయాలి?" అని ప్రశ్న వేశాడు.

అందుకు బోధిసత్త్వుడు "కుమారా!— నీకే నీ తండ్రి రాజ్యం ఈయబోతే నీవు ఇలా చెప్పాలి: 'ప్రభూ!—నే నందరికంటె చిన్నవాడను. నేనూ రాజ్యం పంచుకుపోతే నిన్ను కనిపెట్టుకొని ఉండేవా రెవరు? నాకు రాజ్యంతో పనిలేదు. నీ పదకమలములు కనిపెట్టుకునివుంటా. ఇదే నాకు విధి' అని".

ఒకనాడు, రాజు బోధిసత్త్వుని ఆశ్రమానికి వచ్చాడు. సంవరుడు తండ్రికి నమస్కరించి ఒకపక్కగా నిలబడ్డాడు. అతనిని 'నీ విద్య పూర్తిఅయిందా, కుమారా!'



అని అడిగాడు రాజు. అందుకు బదులుగా 'పూర్తిఅయింది తండ్రీ!' అని వినయంగా బదులు చెప్పాడు సంవరుడు.

'అయితే, నీకు ఇష్టమొచ్చిన రాజ్యం కోరుకో' అన్నాడు రాజు.

అందుకు సంవరుడు 'తండ్రీ!—నేనందరికంటె కడసారివాడను. నేనూ రాజ్యం పంచుకుపోతే నిన్ను కనిపెట్టుకొని ఉండేవారెవరు? నాకు రాజ్యంతో పనిలేదు. నీ పదకమలములు కనిపెట్టుకొని వుండటమే నాకు కావలసింది' అని చెప్పాడు.

పసివాడి మాటలకు రాజు సంతోషించి, 'సరే' అన్నాడు. ఆ మాటప్రకారం సంవరుడు తండ్రిని కనిపెట్టుకొని తండ్రి సమక్షమందే ఉంటూవచ్చాడు. ఐతే, ఎల్లప్పుడూ గురువరుడైన బోధిసత్వుని సలహా పొందుతూనే వుండేవాడు.

ఒకరోజున సంవరుడు మళ్ళీ బోధిసత్వుణ్ణి అడిగాడు: 'నాయనా!—ఇంకా నేను చేయవలసిన పని ఏమిటి?' అని.

బోధిసత్వుడు చెప్పగా, గురువు ఆజ్ఞను అనుసరించి, సంవరుడు తండ్రిని అడిగి ఒక బంజరు తీసుకొన్నాడు. ఆ బంజరును చక్కటి ఉద్యానవనముగా తయారుచేశాడు. ఊరిలో పెద్దపెద్దలనందరినీ ఆ వుద్యానానికి రప్పించాడు. ఈ విధంగా సంవరుడికి ఎందరితోనో పరిచయం కలిగింది.

తరువాత—తండ్రి అనుజ్ఞ తీసుకొని, సంవరుడు నగరంలోని చాతుర్వర్ణాలకూ—సంతర్పణలు చేయించాడు. మరిఒక రోజున ప్రత్యేకించి, రాజాశ్రితులకూ పరివారానికంతటికీ సమారాధన చేయించాడు. ఆ పిమ్మట రాజ్యంలోని పటాలాలకూ, అశ్వదళాలకూకూడా పుష్కలంగా విందు చేయించాడు.

తరువాత-గురువాజ్ఞప్రకారం సంవరుడు తండ్రి అనుజ్ఞ పడసి, పైదేశాలనుండి రాజభవనానికి వచ్చే రాయబారులకూ, వర్తక



ప్రముఖులకూ తగిన చక్కటి వసతులూ అవీ, తనే స్వయంగా యేర్పాట్లుచేశాడు.

తండ్రి సమక్షమందే వుంటూ, ఇటువంటి మంచి పనులను నిర్వహిస్తూ, సంవరుడు రాజ్యంలో అందరకూ 'తలలో నాలుక'గా మసులుకోసాగాడు.

కొంతకాలానికి, వృద్ధుడైన రాజుకు అవసానకాలం ప్రాప్తించింది. అప్పుడు మంత్రులు వచ్చి 'ప్రభూ!—తమ తదనంతరం ఛత్రాధిపత్యం ఎవరిది? యేలిక ఉద్దేశం ప్రకారం నడుచుకొంటాము. సెలవీయండి' అన్నారు.

అందుకు రాజు 'మంత్రులారా!—నా నూరుగురు పుత్రులకూ ఛత్రాధిపత్యం పొందే హక్కున్నది. అందులో మీ కెవరు నచ్చితే వానికి పట్టం కట్టండి!' అన్నాడు.

తరువాత మంత్రులందరూ సమావేశమై, ఈ విషయం బాగా చర్చించారు. అందరి మనసూ సంవరునిమీదనే లగ్నమయింది. ఆప్రకారం సంవరునికే అతి వైభవంగా పట్టంకట్టారు.

గురువర్యుడైన బోధిసత్త్వుని సలహాలు పొందుతూ, సంవరుడు న్యాయమార్గాన రాజ్యపాలన చేయసాగాడు. ఇలా వుండగా— తండ్రి తదనంతరం సంవరుడు ఛత్రాధి



పత్యం వహించిన వార్త తక్కిన తొంభై తొమ్మండుగురికీ తెలిసింది. 'పెద్దవాళ్ళం మనమందరమూ ఉంటూవుండగా, కళ్ళు తెరవని పసికూన—వాడికి ఛత్రాధిపత్యం ఎలా చెందుతుంది?' అంటూ వాళ్లలో వాళ్లు వాదులాడుకోజొచ్చారు.

సోదరులంతా ఒక్కటయారు. 'ఛత్రాధిపత్యం వదులుకుంటావా? మాతో యుద్ధం చేసి గెల్చుకొంటావా?' అని చిన్నవాడికి రాయబారం పంపారు. అంతేకాదు. సైన్యాలతో తరలివెళ్లి కోట ముట్టడికూడా వేశారు.

ఈ వార్త పట్టుకువెళ్లి సంవరుడు గురువుకు తెలియజెప్పాడు. అప్పుడు బోధి



సత్వుడు "ధర్మప్రభూ!—నీవు నీ సోదరులతో ఎన్నడూ కయ్యం పెట్టుకోకూడదు. నీ తండ్రి ఆస్తిని నూరువాటాలుగా పంపకం వెయ్యి. నీ సోదరులకు చెందవలసిన భాగాలు పంచిపెట్టుతూ 'మీకు రావలసిన భాగం ఇదిగో, తీసుకోండి. తోడి సోదరులైన మీతో నాకు పోరు వద్దు' అని వ్రాసి పంపించు" అని చెప్పాడు.

అలానే నడుచుకొన్నాడు సంపరుడు.

అప్పుడు సోదరులందరిలో జ్యేష్ఠుడైన 'ఉపోసతుడు' తక్కినవారినందరినీ సమావేశపరిచాడు. 'తమ్ముల్లారా!— ఈ పిన్నవాడు నిజానికి మనకు బద్ధశత్రువే. వైరివర్గంలోనివాడే. కాని, అలా పరిగణించటానికి మన కతడు అవకాశ మివ్వలేదు. అతని చర్యలన్నీ జనసమ్మతంగా వున్నాయి. తోడిసోదరులమైన మనతో తనకు పోరు వద్దన్నాడు. రాజ్యంలో మనవంతు మనకు సమంగా పంచిపెట్టివేశాడు. ఇటువంటి గుణవంతుడిని ఏమనగలం? వానిలో ఏమని తప్పు ఎంచడం?

'అది అటుంచి—మనందరకూ ఛత్రాధిపత్యం వహించే హక్కున్న మాట నిజమే. ఐనా, అందరమూ ఒక్కసారిగా దానిని పొందలేముకదా. ఈ పరిస్థితులలో మనలో ఈ ఒక్కడినే ఛత్రాధిపతిగా చేసి, అస్తులన్నీ మళ్ళీ రాజ్యానికే చెందజేయటం ఉత్తమమని నాకు తోస్తుంది' అన్నాడు.

ఈ మాటలకు సోదరులందరూ ఏకీభవించారు. వారందరూ ఇప్పుడు సేనలతో సహా నగరంలో ప్రవేశించారు. ఐతే, ముట్టడించే ఉద్దేశంతో కాదు—సోదరుడైన సంపరుణ్ణి గౌరవించే సంకల్పంతో!

సంవరుడు అన్నలందరకూ ఘనమైన స్వాగతమిచ్చాడు. వారందరూ ఉచితస్థానాలను అలంకరించగా, ఛత్రాధిపతి అయిన సంవరుడు గద్దెపైన రాజహుందాతో ఆసీనుడైవున్నాడు.



చిన్నితమ్ముడైన సంవరుణ్ణి చూచి జ్యేష్ఠుడైన ఉపోసతుడు ఇలా తలిచాడు: 'తన తరువాత సింహాసనం ఆక్రమించగల అర్హత సంవరునికే వున్నట్టు మా తండ్రి ముందుగానే నిశ్చయించివుంటాడు. ఈ ఉద్దేశంతోనే మా అందరకూ తలకొక రాజ్యమూ ఇచ్చి, అప్పటిమట్టుకు చిన్నవానికేమీ ఇవ్వకుండా ఊరుకొన్నాడు.'

ఇలా అనుకొన్నతరువాత ఉపోసతుడు తమ్మునివైపు తిరిగి 'ధర్మప్రభూ!—అందరిలోనూ మంచిగా వుండగల ఇంతటి శక్తి నీ కెలా కలిగింది? ఇదేమన్నా మంత్రమా? మహిమా?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

బదులుగా సంవరుడు: 'అన్నా!—నాకు మంత్రాలూ మహిమలూ తెలియవు. పెద్దలను పూజిస్తాను. యతీశ్వరులను సేవిస్తాను. ఎక్కడ వున్నా మంచి గ్రహిస్తాను. ఎవరినీ ద్వేషించను. పరివారానికి జీతాలు పూర్తిగా ఎప్పటికప్పుడు ఇచ్చేస్తాను. నా రాజ్యానికి వచ్చే వర్తకులనూ రాయబారులనూ తగినట్టుగా గౌరవిస్తాను. ఇదే మొదటినుంచీ నా రాజ్యంలో జరుగుతున్న పని. ఇంతకు మించి మరేమీ లేదు' అని చెప్పాడు.

అప్పుడు తమ్ముని గుణాలను మెచ్చుకొన్న ఉపోసతుడు మళ్ళీ ఇలా అన్నాడు: 'తమ్ముడూ, సంవరా!—ఇదేవిధంగా ధర్మపద్ధతిని నీవు రాజ్యం పాలించి, పేరు గడించు. నీ సోదరులమైన మేమందరమూ నిన్ను దీవిస్తున్నాము. నీకు శత్రుభయమేమీ లేదు. నిన్నూ నీ ఆస్తులనూ మేము వేయి కన్నులతో కాపాడతాము. భూలోకమందు నీవు దేవేంద్రపదవి అనుభవించు.'

అన్నలందరూ కాశీరాజ్యమందు ఒక మండలము రోజులుండి, తమ్మునివల్ల సమస్త మర్యాదలూ పొంది, పిన్నవానిని ఆశీర్వదించి, ఎవళ్ళ రాజ్యానికి వారు సంతృప్తితో వెళ్ళిపోయారు.





# దాదాషా సమాధి

అనేకవందల సంవత్సరాల క్రిందట—బీదర్ అనే గ్రామంలో ఒక చిన్న మఠం వుండేది. ఆ మఠంలో దాదా అనే ఒక భక్తుడూ, వుస్సేన్ అనే అతని శిష్యుడూ, ఒక చిన్న గాడిదపిల్లతో సహా ఉంటూ వుండేవాళ్ళు.

ఆ దరగా—అంటే సాయిబుల మఠం అన్నమాట—మక్కాకు పోయే దారిలో ఉండటంవల్ల మక్కా యాత్రికులందరూ ఆ దరగాలోకి పోయి వాళ్లవాళ్ల భక్తికొద్దీ కానుకలు వేసి వస్తుండేవాళ్ళు.

ఆ వచ్చిన కానుకలవల్ల గురువూ శిష్యుడూ జీవిస్తూవుండేవాళ్ళు. ఆ మఠంలో 'జీవసమాధి' అయినట్టుగా చెప్పి, తన గురువుగారినిగురించి దాదా పెద్దపెద్ద పాటలూ తత్వాలూ పాడుతూఉండేవాడు. తన శిష్యుడు వుస్సేన్‌కుకూడా అవన్నీ చక్కగా నేర్పాడు.

కొన్నాళ్ళయేసరికి వుస్సేన్‌కు మనసులో ఒక కోరిక పుట్టింది. గురువుగారిదగ్గరికి వెళ్లి ఇలా అడిగాడు: 'ఇంతమంది సాయిబులు మక్కా పోయి పుణ్యం సంపాయించుకుని వస్తున్నారుగదా. మరి నేనుకూడా వెళ్లి వస్తాను గురూ. అనుజ్ఞ యిప్పించండి' అన్నాడు వుస్సేన్.

'సరే నాయనా, నీవు చేసిన సేవకు మెచ్చాను. కాని ఫకీరును కావటంవల్ల నా దగ్గర ఏమీ లేదు. అయినా నీకు నేనిచ్చే బహుమతీ ఒక్కటుంది. అదే మన గాడిద పిల్ల. దీనిని శ్రద్ధగా గురువుగారు యిచ్చిన కానుకగా స్వీకరించి తీసుకుపో' అని హితవు చెప్పాడు దాదా.

సరే. ఒక మంచిముహూర్తం చూచుకొని, దారిలోకి కాస్త రొట్టె వగైరాలు తీసుకుని గాడిదపిల్లను వెంటబెట్టుకుని మక్కాకు బయలుదేరాడు వుస్సేను. పది పదిహేను

సుంకర రామకోటి






మజిలీలు చేసినతరువాత ఒక పెద్ద ఎడారి దాటవలసి వచ్చింది. గాడిదపిల్లకు ఎప్పుడూ ఇంత దూరం నడవటం అలవాటు లేక పోవటంవల్ల, నడవలేక నడవలేక కూల బడటం మొదలుపెట్టింది.

అయ్యో, గురువుగారిచ్చిన బహుమతీ ఇలా అయిపోతున్నదే అని విచారించి, వుస్సేను గాడిదపిల్లను మెడమీద వేసుకుని రెండు మూడు మజిలీలు దాటాడు. కాని పాపం గాడిదపిల్ల, సరిగా మేత లేక, వడదెబ్బకు తట్టుకోలేక, ఒకరోజున పాపం, చచ్చి వూరుకుంది.

అది చచ్చినా బ్రతికినా గురువుగారి బహుమతీ కావటంవల్ల ఆ శవాన్నే బుజాన వేసుకుని మర్నాడు ప్రొద్దుపొడిచేసరికి ఒక నీళ్ళు వుండే ఖర్జూరపు గుబురు వద్దకు చేరాడు వుస్సేను. శవం కంపు కొడుతుంది, యిక లాభం లేదనుకుని ఒక లోతైన గొయ్యి తీసి అడుగున కొన్ని ఖరూరపు మండలు పరిచి గాడిదపిల్ల శవాన్ని పెట్టి, పైన మళ్లా మండలు వేసి యిసకతో దానిని బాగా కప్పివేశాడు.

ఇంతలో ఆ రాజ్యాన్ని ఏలే సుల్తానుగారి సిపాయిలు కొంతమంది వచ్చి ఏమిటిదని అడిగారు. వుస్సేన్ తత్తరపోయి 'అయ్యా ఇది మా గురువులైన దాదాషాగారి జీవ సమాధి అండీ. ఒక గంటక్రిందటే ఆ మహానుభావులు సమాధిఅయ్యారండీ' అని వణికిపోతూ చెప్పాడు. భక్తితో వాళ్ళు సమాధికి నమస్కరించి వెళ్లిపోయారు.

వుస్సేన్‌కు అక్కడ వుంటేనే మంచిదని వూహ తట్టింది. నాలుగైదు కర్రలు సంపాయించి చిన్న గుడిసె వేశాడు. ఆ సమాధి మీద వచ్చీ పోయేవాళ్ళకు కనబడేటట్లు ఒక రాతిపలకమీద 'దాదాషా జీవసమాధి మందిరము' అనివ్రాసి, తత్వాలు పాడుతూ అక్కడే కూర్చున్నాడు. ఇలా వుండగా, క్రమేణా ప్రయాణీకులు ఆ గుడిసెకు



లోపల హుక్కా త్రాగుతూ, శిష్యులు కొలువగా పట్టుపరుపులపై నవాబుదర్జా వెలిగిస్తున్న తనశిష్యుణ్ణి చూచి దాదాగారు నిశ్చేష్టుడయ్యాడు. వెంటనే శిష్యులందరినీ హుస్సేన్ బయటకు పొమ్మనిచెప్పి, గురువుగారి కాళ్లపై బడ్డాడు.

'ఏమిటి నాయనా, ఇదంతా?' అన్నాడు ఆత్రంతో దాదాగారు.

'ఏంచెప్పను గురూ. ఇదంతా మీ దయ. మీరిచ్చిన గాడిదపిల్ల చచ్చింది. దానిని ఇక్కడే పూడ్చాను. తలవని తలంపుగా రాజభటులు వచ్చారు. ఎప్పుడూ ఎరగని ఆ రాజభటుల్ని చూడగానే భయపడి, గభీమని మీ పేరు చెప్పివేశాను. మీ పేరుమీదనే ఇంతవరకు ఈ సమాధి నడచిపోతున్నది. తీరా ఇప్పుడు కొంపతీసి మీరు ఫలానా అని తెలిస్తే, మనిద్దరికీ మొప్పమే వస్తుంది. మరి అటుపైన మీదయ!' అన్నాడు, హుస్సేన్.

అందుకు దాదా 'నాయనా! నేను చెప్పలేదా గాడిదఐతేనేం, ఎప్పటికైనా ఎందుకైనా పనికివస్తుందీ అని. అక్కడ నేను పూజించే సమాధిమాత్రం ఏమిటనుకొంటున్నావు? అది దీని తల్లివే!' అన్నాడు.

ఈ కీలకం ఇప్పుడు తెలియగానే నిర్ఘాంతపోయాడు శిష్యుడు హుస్సేన్.

రావటం, కానుకలు సమర్పించుకోవటం జరుగుతూవచ్చింది. కొన్నాళ్లకు హుస్సేన్ బాగా డబ్బు వెనకేసి, చక్కటి భవనమే కట్టించాడు ఆ యెడారిలో. ఇట్లా దాదా కీర్తి చాలాదూరం వ్యాపించింది.

అది పోయిపోయి 'బీదర్'లో ఉంటున్న అతని గురువు దాదాషాగారివరకూ ప్రాకింది. ఈమహానుభావుడు ఎవరై ఉంటాడో చూద్దామని బుద్ధిపుట్టి దాదాగారు కొన్నాళ్లకల్లా ఆ భవనంవద్దకు చేరుకొన్నాడు. ఆ గుర్రాలను, ఒంటెలను, ఆ భవనాన్ని చూచి ఆశ్చర్యపడ్డాడు. లోపలికి వెళ్ళాడు. ఇంకా ఆశ్చర్యపడ్డాడు.




**2**

[కుండలినీద్వీపరాజైన చిత్రసేనుడు కీర్తికాంక్షతో ప్రజలపై పన్నులు సగానికిసగం తగ్గించివేశాడు. ఫలితంగా ధనాగారం వట్టిపోయింది. సేనాని సలహాపైన ధనం దోచుకువచ్చేందుకు కుండలిని సైన్యాలు ఓడలలో బయలుదేరినై. అదే సమయంలో దక్షిణదిశను తోకచుక్క కనబడింది.—]

ఏమయితేనేమి, కుండలినీ రాజ్య సైనికులతో బయలుదేరిన ఓడలు తీరం వదిలి సముద్రంలోపలకు పోసాగినై. అప్పుడు సముద్రం ప్రశాంతంగానూ, గాలి ఎంతో అనుకూలంగానూ ఉన్నయి.

సైనికులందరూ ఆనందంగానే వున్నారు. కాని, సేనాధిపతిఐన సమరసేనుడుమాత్రం తన ఓడపైన ఒక మూలగా ఆసనం ఏర్పరుచుకొని, దక్షిణ దిక్కున మెరిసే ఆ తోకచుక్కవైపే చూడసాగాడు. ఇంతకుముందు ఆస్థానదైవజ్ఞుడు 'బయలుదేరవద్దు. అశుభం! అశుభం!!' అని స్పష్టంగా చెబితే, ఆ మాట చెవికెక్కలేదు. ఇప్పుడు తోకచుక్కను చూడగా చూడగా సమరసేనుడికి తీరని భయం పట్టుకొన్నది.

కలవరపాటుతో అలా చూస్తూన్నంతలో అల్లంత ఎత్తున కారుమేఘాలు గబగబ వచ్చి, తోకచుక్కను కమ్మివేసినై. కటిక చీకటి అలముకొన్నది. సముద్రుడు గర్జింపసాగాడు. సైనికులు భయకంపితులయ్యారు.

సమరసేనుడు కూర్చుని అలా చూస్తూనే వున్నాడు. అంతలో నౌకాధిపతి వచ్చి—





చేశాడు. అందరూ కూడా—తమ సేనా నాయకునిమీదా, ఇలువేల్పు ఐనటువంటి కుండలినీదేవిపైనా పరిపూర్ణ నమ్మకమున్న దన్నట్టుగా తలలు పూపారు.

ఐతే, కొత్తమార్పు ఏమీ లేదు. ఇంకా సముద్రం అల్లకల్లోలంగానేవుంది. ఆకాశ మంతా కారుమేఘాలతో నిండింది. భయంకరమైన పెనుగాలికూడా ప్రారంభమైంది.

ఇది చూచి సైనికులకు గుండెనిబ్బరం సడలింది. ప్రతి ఒక్కరికీ వళ్ళు కంపించ సాగింది. ఆ వాయువేగానికి ఓడలు, ఒక దారీతెన్నూ లేకండా, తలకొక దిశకూ చెదరిపోయినై. ఈ స్థితిలో ఎవడికి వాడు, ఏ అసరా దొరికితే అది చేతపట్టుకొని, ప్రాణరక్షణకోసం పెనగులాడజొచ్చాడు.

''మహాసేనానీ! మన సైనికులలో కోలాహలం బయలుదేరింది. ఒక్కొక్కరూ తిరుగుబాటు స్వభావాన్ని కనబరుస్తున్నారు'' అని చెప్పాడు.

కూర్చున్న చోటునుంచి లేచాడు సమరసేనుడు. ఒకమారు ఆకాశంకేసీ, ఒకమారు సముద్రంకేసీ చూచాడు.

'కుండలినీదేవి కరుణిస్తే, త్వరలోనే అంతా అనుకూలమవుతుంది. సమరసేనుడి నాయకత్వంకింద సైనికులకు, ఎన్నటికీ చెరుపు లేదని చెప్పండి!' అన్నాడు.

నౌకాధిపతి పోయి, సమరసేనుడు చెప్పిన మాటలను అందరకూ వినికిడి

రాత్రి అవుతున్నకొద్దీ గాలి తీవ్రతరమవుతూవుంది. నావికుల స్వాధీనం తప్పిన ఆ ఓడలు ఒకదానికొకటి ఢీకొని ఛిన్నాభిన్నం కాసాగినై. తక్కిన ఓడలన్నీ దెబ్బతిన్నాయికాని, సమరసేనుడు ఎక్కివున్న ఓడమట్టుకు పటిష్ఠంగా నిర్మింపబడిందికావటంచేత, అలలమీద తేలిపోతూనేవుందికాని, శిథిలంకాలేదు.

సూర్యోదయం ఐతేగాని, ఎన్ని ఓడలు మునిగినయో, ఎంతమంది చచ్చిపోయారో





లెక్క దొరకదు. సమరసేనుడుమాత్రం ఏం చెయ్యగలడు? తన ఓడలో ఉండే కుండలినీదేవి విగ్రహంముందు మోకరిల్లి, భక్తితో ప్రార్థిస్తున్నాడు.

చిత్రమేమిటోకాని, ఆకస్మికంగా బయలుదేరిన గాలీ మబ్బులూ, వచ్చినవి వచ్చినట్టుగానే మాయమైపోయినై. దేవి విగ్రహంముందు తపోనిష్ఠలో కూర్చొనివున్న సమరసేనుణ్ణి సైనికులు ఆత్రంతో పిలిచారు: 'అలజడి తగ్గింది. సూర్యోదయమయింది. ఒక్కసారి వచ్చి దర్శనమివ్వండి' అంటూ.

బ్రహ్మాండమైన బరువు దించుకున్నట్టయింది సమరసేనుడికి. ఒక్కసారి పెద్దగా నిట్టూర్చి, పైకి వచ్చాడు. తన ఓడలలో సగానికి సగం సముద్రంలో కలిసిపోయినై, మిగినవయినా ఒకచోట లేవు. రెండుమూడు మైళ్ళ కైవారంలో నడిసముద్రమందు అవన్నీ తేలి ఆడుతున్నయి.

చచ్చినవాళ్లు ఛావగా, మునిగిన ఓడలు మునిగిపోగా, ఉన్నవాటినైనా ఒక్కచోట చేర్చటమే కర్తవ్యమని నిశ్చయించాడు. వెంటనే తన ఓడకు లంగరు వేయించాడు. ఓడలమీద మనుషులను పంపి, దూరాన వుండే అందరనూ రప్పించాడు.

కబురు వెళ్ళీ వెళ్ళటంతోనే చెదరిపోయిన ఓడలన్నీ ఒక్క చిటుకసేపటిలో వచ్చేసి, సేనానివుండే పెద్దఓడ చుట్టూ చేరుకొన్నయి. సైనికులందరూ ఓడలపైకి వచ్చి నిలబడి, సేనానికి తలలువంచారు.

ఆ నిలబడినవారిలో ప్రతి ఒక్కడూ, రాత్రి తుపానుదెబ్బకు నానా యాతనలూ పడి, అదృష్టవశాన బతికి బయటపడ్డవాడే! ఇంకా యేమి కీడు మూడబోతుందోనని గుండెబెదురుతో భయపడుతూనేవున్నారు.

పరిస్థితి అంతా ఇట్టె పసికట్టాడు సమరసేనుడు. రాత్రికలిగిన ఉదుటుకు, సముద్రమంటే సైనికులందరూ హడలిపోతున్నారు.



అందుచేత, ఇంకా సముద్రంమీదనే కాలం గడపడమనేది కానిపని. చూడగా తామి ప్పుడు ఎక్కడవున్నదీ, జాడ తెలియటమే లేదు. వెంటనే ఒకరిని తెరచాపకొయ్య శిఖరానికంటా ఎక్కి చూడమన్నాడు సమరసేనుడు.

సేనాని ఆజ్ఞప్రకారం ఒకడు శిఖరం ఎక్కాడు. తక్కిన అందరి దృష్టి ఆతని మీదనే లగ్నమైవుంది. ఆ యెక్కినవాడు కొంతసేపు చుట్టూ పరికించి, "దగ్గరలో ఎక్కడా భూప్రదేశం కనపడటంలేదు. కాని... తూర్పుదిక్కున చాలా దూరంలో పక్షులు ఎగురుతున్నట్టుగా నా దృష్టికి గోచరిస్తున్నది," అన్నాడు.

ఈ మాట చెవినిపడగానే సమరసేనుడు "జై—కుండలినీ మహాదేవికి జై" అంటూ ఉత్సాహంతో కేకలుపెట్టాడు. అతనితోపాటు సైనికులందరూ 'కుండలినీమహాదేవికీ జై!' అని పెద్దగా విజయధ్వానాలు చేశారు.

పక్షులెగురుతున్నవని వినగానే, రక్షణ దొరికినట్టే సంతోషించాడు సమరసేనుడు. సమరసేనుడితోపాటు సైనికులుకూడా సంతోషించారు.

సేనాని ఆజ్ఞప్రకారం ఓడలన్నీ ఆ పక్షులు ఎగురుతున్న దిక్కుకే పోసాగినై.







తెరచాప కొయ్యపైకి ఎక్కిన సైనికుడు అక్కడనే వుండి, ఓడలన్నిటికీ దారి చూపుతున్నాడు. ఎంతకూ భూమి ఆనవాలు దొరకనందున సైనికులలో మళ్ళీ నిరాశ అలముకొన్నది. సూర్యాస్తమయం కాబోతున్నదనే సరికి, 'అయ్యో!—ఇంకాస్సేపటిలో చీకటి పడిపోతుందే!—ఈ మహాసాగరంలో నడుమధ్యని దారీ తెన్నూ కానక తపించాలి కదా!—' అని భీతి చెందసాగారు.

అటువంటి సమయంలో శిఖరంమీద ఉన్న సైనికుడు "అదిగో!—అదిగో!—భూప్రదేశం! దగ్గరలోనే వుంది," అని ఎలుగెత్తి అరిచాడు. అందరూ సంతోషించారు.

ఓడలన్నీ అదే దిశకు సాగిపోతున్నవి. అంతలోనే సూర్యాస్తమయమయింది. అయ్యేసరికే ఓడలన్నీ ఒకానొక భూప్రదేశానికి చేరుకున్నాయి. అది ఒక ద్వీపమని తెలిసింది. భూమిమీద అడుగుపెట్టాలని ప్రతీసైనికుడి మనసూ ఉరకలు వేస్తున్నది. కాని, 'ఒకళ్ళూ ఓడ దిగవద్దు' అని ఆజ్ఞ ఇచ్చాడు సమరసేనుడు.

ఇప్పుడు వారు చేరుకున్నది ఒక ద్వీపం. భయంకరమైన ఒక మహాద్వీపం. సముద్రం లోపలికంటా ఒరుసుకువచ్చిన పర్వతపంక్తులు. వాటిపైన ఇచ్చవచ్చినట్టు పెరిగిన మహావృక్షాలు. పైగా–వింతవింతల వన్యమృగాలు—ఇటువంటివాటితో కూడుకొన్న ఆ కొత్తప్రదేశం ఎలాటిదో తెలుసుకోకుండా సైనికులు దిగటం ప్రమాదం కదా!—అందుకనే ఒక్కళ్ళనూ ఓడ దిగవద్దన్నాడు సమరసేనుడు.

ఐతే, తన సైన్యాన్ని రెండుపాయలుగా విడదీశాడు. అందులో కొంతమందిని చిన్న చిన్న పడవలలో ఆ ద్వీపంయొక్క తీరానికి పంపడం మంచిదని తలిచాడు. వీరు పోయి, మంచిచెడ్డలు తెలుసుకువచ్చాక, తక్కిన వాళ్ళు పోయి రావచ్చునని అతని వుద్దేశం. ఐతే—ముందుగా ఆ ప్రదేశానికి పోయి



రావటానికి సమర్థత గల ఆ సైనికు లెవరు? అటువంటి కొత్త ప్రదేశానికి పోయి సంగతి సందర్భాలు తెలుసుకోవాలంటే ధైర్యమూ సాహసమూ మాత్రమే చాలదు; సమయోచితమైన యోచనా, యుక్తీ కావాలి.

ఇంతగా ఆలోచించిన తరవాత, స్వయంగా తను వెళ్లిరావటమే అన్నివిధాలా శ్రేయస్కరమని తోచింది సమరసేనుడికి. ఎంతటివాడికైనా ఒంటరిగా వెళ్లటం ప్రమాదకరమే. అందుకని, ఆరితేరి అనుభవం గడించిన ఆరుగురు సైనికులను యెంచి, వెంటతీసుకొని ఆ కొత్తద్వీపానికి బయలుదేరాడు. సమరసేనుడూ, ఆరుగురు యోధులూ చిన్న పడవలెక్కి, కొంచెం సేపటిలో తీరం చేరుకొన్నారు.

తీరప్రాంతమంతా నిర్జనంగా వుంది. ఎక్కడా మానవుడు మసిలిన అలికిడే లేదు. అంతమాత్రాన సమరసేనుడు ఏమరిపాటు చెందలేదు. ఆయుధహస్తుడై సిద్ధంగానే వున్నాడు. 'ఏ చెట్టు చాటునించో, హఠాత్తుగా ఒక బాణం రావచ్చుకదా...' అని అనుమానం కలిగింది సమరసేనుడికి.

అనుమానిస్తూ ముందుకు కదులుతూ వున్న అతనికి భయంకర గర్జన వినబడింది!

'సేనానీ! ఈ గర్జన సామాన్యమయింది కాదు. ఇటువంటి వికృతమైన, భీతావహమయిన గర్జన మా జీవితంలోనే విని ఉండలేదు' అన్నారు యోధు లారుగురూ, కంపించిపోతూ.

ఈ మాట నిజమని తోచింది సేనానికి. ముందుకు నడిచాడు సమరసేనుడు. ఆయుధహస్తులైన యోధులారుగురూ అతని వెంబడే నడవసాగారు. కాస్సేపటిలో చెట్ల మధ్యకు చేరుకొన్నారు. వారిముందున్న పెద్ద కొలనుకేసి చూచారు.

అక్కడిదృశ్యానికి వారు నిశ్చేష్టులయారు. ఏమీ?—అనుకొన్నట్టుగానే, అది ఒక భయంకొలిపే వింతజంతువుల పోరాటం!-



విచిత్ర రూపాలతో మరి ఎన్నెన్నో మృగాలు చుట్టుపక్కలనుండి ఆ పోరాటాన్ని తిలకిస్తున్నాయి. దరిదాపుల చెట్ల కొమ్మలపైన మనుష్యాకారంలో వుండే, పెద్ద పెద్ద నరవానరాలు రణరంగాన్ని చూస్తూ, వాటిలో అవి మాటాడుకొంటున్నయి. శిలలతో తయారైన ఆయుధాలను అవి చేతులలో ధరించివున్నాయి.

సమరసేనుడు, తోడి యోధులతో ఇలా అన్నాడు: 'నిజంగా ఇవన్నీ వింతజంతువులే. ఆ చెట్లపైనున్నది నరులూ కాదు, వానరాలూ కాదు. రాతియుగంలో నివసించిన మానవులను మనం చూస్తున్నామన్నమాట. ఇప్పుడీ జంతువులు ఎన్నో లక్షల సంవత్సరాలకు పూర్వపువి.' ఏమి చెప్పటానికీ సైనికులకు తోచలేదు. ఇంతటి భయంకరమైన ద్వీపంనుండి దోచుకుపోదామంటే వాళ్ళకు ధనరాసులేం దొరుకుతై?

సరీగా ఇదే ఆలోచన, సమరసేనుడికీ కలిగింది. కుండలినీరాజ్యపు ధనాగారాన్ని నింపటానికిగాను పరరాజ్యాలు కొల్లగొట్టే వుద్దేశంతో బయలుదేరాడాయె తను. అందుకు బదులు ఇప్పుడీ భయంకరమైన ద్వీపం తగిలింది. ఏమిటి కర్తవ్యం?

ఇలా అతని ఆలోచన సాగిపోతూ వుండగా ఆ వింత జంతువుల పోరాటం భయంకరం కాజొచ్చింది. చుట్టూ వున్న చెట్ల చాటునుంచి ఏనుగులు ఘీంకరిస్తూ దూరంగా పారిపోసాగినై. వాట్లలోనుంచి ఒక ఐరావతంలాంటి ఏనుగు వేరుపడి సమరసేనుడు దాగివున్న వైపుకే గబగబ పరుగెత్తి రాజొచ్చింది.

సైనికులను హెచ్చరించి సమరసేనుడు చెట్టుపైకి ఎగబాకాడు. అదే సమయంలో గర్జిస్తూ రెండు సింహాలు ఆ ఏనుగుమీదికి ఎగసివచ్చినై.

—[ఇంకా వుంది]






సిరిపురరాజ్యానికి ప్రభువు ప్రదీపుడు. ప్రదీపుని ఆస్థానంలో రాజుకంటే ఎక్కువ ప్రతాపం కలవాడు రాజగురు. రాజగురు మాటకు ప్రదీపుడు ఎన్నడూ ఎదురాడి యెరుగడు.

ఏమీ అంటే—ఈ రాజగురు మామూలు పురోహితు లందరివంటివాడు కాదు. మహా తపశ్శాలి. 'సంజీవి' విద్యను కూడా సాధించి, సిద్ధిపొందినవాడు. ఇటువంటి మహిమ కలిగివుండటంచేతనే, రాజగురునకు ప్రదీపుడు లొంగివుండటం, ప్రదీపునికి సామంతులందరూ తల ఒగ్గటమున్నూ.

ప్రదీపునికి ఒకే ఒక్క కుమార్తె సుధీమణి. రాజగురునకూ ఒక కూతురున్నది–సౌమ్య. బాలికలిద్దరూ సమవయస్కులు. ఒక కంచాన తిని, ఒక మంచాన పండుకొంటూవున్న ప్రాణస్నేహితులు. ఎన్నడు గాని, ఇద్దరూ ఒకరిని విడిచి ఒకరు ఉండలేకపోయేవాళ్ళు.

ఇటువంటి నేస్తులు, ఒకరోజున ఉద్యానవనంలోని కొలనుకు జలకమాడబోయారు. దుస్తులు తీసి గట్టుపైన పెట్టుకొని, నీటిలో దిగారు. వాళ్ళు దిగిన కొంచెంసేపటిలోనే అకస్మాత్తుగా పెద్ద గాలి వచ్చి, వాళ్లు పెట్టుకొన్న దుస్తులన్నీ తారుమారయిపోయినై. గాలివేయటంవల్ల వాళ్లు వెంటనే జలక్రీడలు ముగించుకొని, గట్టుమీదికి వచ్చేశారు. ముందుగా వచ్చిన రాజకుమారి తొందరలో సౌమ్యచీరను కట్టేసుకుంది.

ఇది చూచి సౌమ్య "అక్కా!—నువ్వు కట్టుకొన్నది నా చీరసుమా!" అన్నది. ఇందుకు రాజకుమారి అదొకలాగ ముఖం పెట్టి, "నీచీర యేమిటే, నీ చీర? అంతా మా సొమ్మే కదా?" అని వ్యధికరణంగా

జి. మనోరమ




మాటాడింది. ఈ మాటకు సహించ లేక, సౌమ్య బదులుచెప్పింది.

సౌమ్య అలా బదులుచెప్పినకొద్దీ రాజ కుమారికి రాజసం ఎక్కువ కాసాగింది. "మా సొమ్ము తిని బతుకుతూ మమ్మలినే తూలనాడతావా? అంత కళ్ళు నెత్తిమీదికి వచ్చినయా?" అంటూ, సుధీమణి సౌమ్యను కొట్టి, పక్కనున్న పాడు నూతిలోకి తోసివేసి, తనమానాన తను వెళ్లి పోయింది. ఇంత గొడవ జరిగినా, రాజుకు గాని, రాజ్యంలో మరెవ్వరికిగాని కాస్తం తయినా తెలియనే తెలియదు. సౌమ్య, పాపం—ఆ పాడునూతిలోనే పడివున్నది!



ఇలా వుండగా, వేటకోసమని మాసల రాజకుమారుడు ఆ ప్రాంతానికి వచ్చాడు. పాడునూతిలోపలినుంచి మనిషి కంఠస్వరం వినిపించేసరికి, పోయి తొంగిచూచాడు. చూచి, సౌమ్యను వెంటనే పైకి తీసి, కుశల ప్రశ్నలు వేశాడు. ఆమె ఫలానా గురుపుత్రి అని తెలుసుకొని చాలా విచారించాడు.

సౌమ్య, తన కథను అతనితో వలపోసు కొని, తనను రాణిగా చేసుకోమని ప్రాధేయ పడింది. సౌమ్య అతనిని ఆకర్షించిన మాట నిజమే. కాని, ఆమె కోరికను మన్నించ టానికి అతను సాహసించలేకపోయాడు.

ఏమీ?—'సంజీవి' మహిమలో సిద్ధు డైన రాజగురు కూతురాయె ఆమె! అందు చేత మారుచెప్పకనే మరలిపోయాడు.

పరిస్థితులు ఎదురెత్తుగా ఉండటం చూచి, సౌమ్య నిరాశతో ఒక చెట్టుకింద కూర్చొని ఏడువసాగింది.

ఇంతలో అక్కడ—రాజగురు, తన కూతురు కనబడకపోవటంతో, కలవరపడి రాజువద్దకు వెళ్ళాడు. రాజుకూ అగమ్యం గానే తోచింది. వెంటనే భటులనూ, పరి చారికలనూ పంపించి గురుపుత్రిని వెతుక్కు రమ్మన్నాడు ప్రదీపుడు. వారు పోయి వెతకగా వెతకగా, కొంతమంది పరిచారి

కలకు చెట్టుకింద విలపిస్తున్న సౌమ్య కంటబడింది. కాని, ఎన్నివిధాల బతిమాలినా ఆమె ఇంటికి రానన్నది.

ఈ మాట వచ్చి చెప్పేసరికి, రాజగురు ఉగ్రుడయ్యాడు. రాజు కంగారుపడ్డాడు. ఉన్నపాటున ఇద్దరూ, పాదచారులై ఆ చెట్టుకిందికి పోయి, సౌమ్యవల్ల సంగతి సందర్భాలు తెలుసుకొన్నారు.

రాజు విచారానికి అంతు లేకపోయింది. గురువు పాదాలకు నమస్కరించి, "మహాత్మా!—ఇది నా తప్పు. నన్ను అనుగ్రహించి పిల్లను క్షమించండి. దాసానుదాసుడను .." అంటూ ప్రార్థింపసాగాడు.

అప్పుడు రాజగురు తన కుమార్తెను ఇంటికి రమ్మంటే, ఆమె రెండు కోరికలు కోరింది: మొదటిది—తను ఫలానా మౌసల రాజపుత్రునికి భార్య కావటం. రెండవది—రాజకుమారి ఐన సుధీమణి తనవెంట ఆ రాజ్యానికి చెలికత్తెగా రావడం.

రాజువైపు చూచాడు రాజగురు. రాజు తనవల్ల కావలసిన ఏపని ఐనాసరే చేసే తీరుతానని వాగ్దానం చేశాడు. అంతట—తండ్రి అనుజ్ఞ ఇవ్వగా, సౌమ్య మౌసల రాజపుత్రుని పెళ్ళాడటమూ, ఆమె వెంట సుధీమణి వెళ్ళటమూ, అనుకొన్న ప్రకారం




జరిగింది. ఇప్పుడు సౌమ్యవశంలో ఉన్న సుధీమణి, ఇష్టమున్నా లేకున్నా, ఆమె చెప్పిన పనులన్నీ చేసేతీరవలసి వచ్చింది. సుధీమణికి ఇటువంటి ఒత్తిడితో కాలమానం గడచిపోతూవుంది.

కొంతకాలానికి సౌమ్య కొడుకును కన్నది. కొడుకు పుట్టినప్పటినుంచీ సౌమ్య సుధీమణిని కోడరికం పెట్టడం మరీ ఎక్కువైంది. ఇది చూచి రాజపుత్రుడు సహించలేకపోయాడు.

ఆమెను ఈ చిక్కునుండి విడిపించటానికే రాజపుత్రుడు నిశ్చయించుకొన్నాడు. ఈ సంకల్పంతో రాజపుత్రుడు సుధీమణిని

వప్పించి, దూర ప్రదేశం తీసుకపోయి, ఆమెను పెళ్లిచేసేసుకొన్నాడు.

ఇది ఎలా ఐతేనేం, సౌమ్యకు తెలిసింది. ఆమె తండ్రివద్దకు పోయి గోల పెట్టింది. తండ్రి ఐన రాజగురు ఉగ్రుడై, వెంటనే 'రాజపుత్రుడు వృద్ధుడుగా మారిపోవుగాక!' అని శపించాడు. శాపం తగిలి, తక్షణమే మౌసల రాజపుత్రుడు ముసలివాడుగా మారిపోయాడు.

ఇలా మారిపోయిన రాజపుత్రుడు మామ అయిన రాజగురువద్దకు పోయి, అన్ని సంగతులూ వెల్లడించి, న్యాయం పాలించమని వేడుకొన్నాడు.

క్షణంసేపు ఆలోచించాడు రాజగురు: 'శాపమా తిరుగులేనిది. ఐతే, ఎవరైనా కోరి తీసుకొంటే నీ ముసలితనం పోతుంది!' అని సర్ది చెప్పాడు.

ఎవళ్ళూ కోరి ముసలితనం తమపైకి తీసుకోరనే ధీమాతోనే ఇలా అన్నాడు.

అంతా బాగానే వుంది. కాని, రాజగురు తలచినట్టుగానే, ముసలితనం తీసుకోవటానికి ఒక్కళ్ళూ ఇష్టపడలేదు. రాజపుత్రుడు ఈ దిగులుతో వుండగా, అతని కొడుకు, ఎవరికీ తెలియకుండా, వృద్ధాప్యం తనకు రావాలని కోరుకొన్నాడు.

అకస్మికంగా తన రూపం మారిపోవటంతో రాజపుత్రుడు ఆశ్చర్యపోయాడు. ఇదేమిటా అని పరిశీలించగా, ముసలి రూపంలో వున్న తన పసివాడు ఎదుట పడ్డాడు. తండ్రి మనోవేదనకు అంతు లేకపోయింది.

ఇదంతా రాజగురునకు తెలిసింది. ముద్దుల మనమడిని ఆ రూపంలో చూచి ఏ తాత సహించగలడు? మనమడి త్యాగాన్ని మెచ్చుకొని, వెంటనే శాపం ఉపసంహరించుకొన్నాడు. నాటినుంచీ సౌమ్య, సుధీమణులు చిన్నప్పటిలాగే కలసిమెలసి సుఖంగా వుంటున్నారు.






చిన్నప్పుడు

## 1. బడిలో నా అల్లరి

అల్లరి అంటే సామాన్యంగా చెడ్డపని అని అనుకొంటారు చాలామంది. నిజానికి అల్లరి అనేది బాలబాలికల ఉత్సాహానికీ, వయసుకూ తగినటువంటి స్వభావసిద్ధమైన ఒక అలంకారం. చిన్నబిడ్డలు చేసే అల్లరిలో చక్కటి యోచనా, కల్పనా, యుక్తీ, ధైర్యమూ ఎన్నో ఇమిడివుంటాయి. అయితే మోతాదు మించినప్పుడు వెగటుగా వుంటుంది కాని, హద్దులో చేసే పిల్లల అల్లరి ముద్దుగానే వుంటుంది. చిన్న పిల్లలు చేసే అల్లరి పెద్దవాళ్ళకు చేత కానేకాదు. ఒకవేళ వారు చేయబోయినా, అది అసహజమనిపిస్తుంది.

మీ అల్లరిచేష్టలు ఇంటిలో—బడిలో—ఆటస్థలాలలో—ఎన్నో రకాలు వుంటయి. ఇప్పుడు మీరు—బడిలో చేసివున్న ఒక చక్కటి అల్లరి ఘట్టాన్ని గురించి మన చందమామలో ఒక పేజీకి సరిపోయేటట్టు ఉన్నది ఉన్నట్టుగా వ్రాసి పంపించండి. మీరు పంపే కవరుమీద 'వ్యాసరచనపోటీ' అని వ్రాయాలి.

సమస్యలు

## సింహం మృగరాజు

అనేది ఒక లోకసత్యం. ఐతే, సింహమే ఎందుకు రాజుగా ఉండాలి? అవుగాని, మేకగాని ఎందుకు ఉండకూడదు? ఉండవచ్చును. ఈ విషయంలో మీ వాదాల్ని సమర్థిస్తూ చందమామలో అర్ధ పేజీకి మించకుండా వ్రాసి పంపండి.

* పై రెండు శీర్షికలకూ సంబంధించిన రచనలను ఒకే కవరులో పంపవచ్చు.
* ఈ పోటీలకు పంపే రచనలు ఫిబ్రవరి 10-వ తేదీలోగా మాకు చేరాలి.
* ఈ పోటీలకు బహుమతు లున్నవి.

పంపవలసిన చిరునామా:—

కథల తాతయ్య, చందమామ, మదరాసు - 26



# ఉపచారం

కోదండపాణి గొప్ప వ్యాపారస్థుడు. బజారులో అంగడి గాక అతనికి గొప్ప భవనమున్నది. ఆ భవనంలో ఎలెక్ట్రిక్‌దీపాలూ పంకాలూ ఉన్నవి. రాత్రిపూట కొట్టు మూసి వేసి ఇంటికి రాగానే, రోజువారీ ఆదాయం ఎంతో తేల్చుకోవటానికని, డబ్బంతా కుమ్మరించి, నోట్లకు నోట్లు, చిల్లరకు చిల్లర వేటికవి విడమర్చి లెక్క పెట్టటం అతనికి మామూలు.

ఒకనాటి రాత్రి పదిగంటలకు అలానే రొఖ్ఖం లెక్కస్తూవున్న సమయంలో, ఎవరో తలుపు తట్టి పిలిచినట్టయింది. పిలుపు అందుకొని బదులు చెప్పకుండావుంటే బాగుండదుకద. అందుచేత, పరిచివున్న రొఖ్ఖంమీద రుమాలు కప్పి, గభీమని వెళ్ళి తలుపు తీశాడు.

చూడగా—ఆ వచ్చినతను గురవయ్య. గురవయ్య కోదండపాణి అంతరంగికులలో ఒకడు. వానికి గల చనవునుబట్టి అతను సరాసరి కోదండపాణి డబ్బు లెక్కస్తున్న గదిలోకే వచ్చేశాడు.

కుశలప్రశ్నలయినై. తరువాత గురవయ్య 'మామా!— నాకు ఇప్పుడొక పెద్ద చిక్కు వచ్చిపడింది. ఎలాఐనా ఒక్క పాతిక రూపాయలు సర్దుబాటు చేయాలి' అని అడిగాడు.

కోదండపాణి ఆలోచనలో పడ్డాడు. తన వ్యాపారపు చిక్కులూ, డబ్బు ఇబ్బందులూ, అన్నీ పూసగుచ్చినట్టు-మనసుకు నచ్చేటట్టు విప్పిచెప్పాడు చాలాసేపు.

'అలాకాదు. ఎంత వడ్డీకైనాసరే, ఎక్కడి నుంచి ఐనాసరే, తెచ్చి పెట్టక తప్పదు' అంటూ బలవంతపెట్టసాగాడు గురవయ్య. మాట తీసెయ్యటానికి వీలులేని పరిస్థితి ఏర్పడింది కోదండపాణికి. ఇదిలా వుండగా—వాళ్ళిద్దరూ ఇలా ప్రసంగించుకొంటూ

డి. నారాయణస్వామి

వుండగానే అకస్మికంగా లైటు ఆరిపోయి, గదిఅంతా చిమ్మచీకటి ఐపోయింది.

వెంటనే కోదండపాణి అప్యాయంగా గురవయ్యా చేతులు రెండూ పట్టుకొని, 'మామా! — మరేమీ అనుకోవద్దుసుమా. నీవంటివాడు ఈ రాత్రివేళ వస్తే మాట తక్కించలేకపోయానుకదా అని మనసులో ఎంతో బాధగా వుంది' అని సానుభూతితో మాటలు సాగించాడు.

పైగా 'రాకరాక వచ్చావు. భోజనంచేసి వెళుదువుగాని' అంటూ కోదండపాణి గురవయ్యాను రెండుచేతులూ పట్టుకొని బతిమలాడసాగాడు. 'అహ–వద్దు, వద్దు. వెళ్లొస్తా' నని గురవయ్యా అంటే, కోదండపాణి ఇంకా బలవంతపెట్టాడు.

అంతలో గుప్పుమని లైటు వెలిగింది. ఇదేమిటా గొడవ చూదామని ఇంటావిడ అక్కడికి వచ్చింది. ఆమట్టున కోదండపాణి గురవయ్యా చేతులు విడిచిపెట్టి, 'ఐనా, గురవయ్యా మామా! — మేము కోరటమే కాని, మాలాటి వాళ్ల ఇళ్లలో మీరు భోంచేస్తారా! సరేలే, కానీ ...'అని తేలికగా అనేశాడు.

గురవయ్యా సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. 'వాడిని భోజనానికి ఉండమని ఎందుకండి అలా బతిమాలుతున్నారూ?' అని కోపంతో అడిగింది కోదండపాణి భార్య.

అందు కతడు 'ఓసి అమాయకురాలా!- వాడి నెవడు ఉండమంటాడు, ఈ అపరాత్రివేళ భోజనానికి! లైటు ఆరిపోవటంచేత, వాడు డబ్బు కాజేసిపోతాడేమోనని ఇంత నాటకం ఆడవలసివచ్చింది' అని సమాధానం చెప్పాడు.

భర్త తెలివితేటలకూ, సమయోచితమైన యుక్తికీ చాలా సంతోషించింది కోదండపాణి భార్య.





# సింహం పోయింది!

మొగలాయి చక్రవర్తి ఐన ఔరంగజేబుకి మహమ్మదీయ మతం అంటే ఎంత అభిమానమో ఇతర మతాలంటే అంత ద్వేషం. అందులోనూ హిందూమతమంటే మరీను.

చక్రవర్తి బారినుండి హిందూమతాన్ని కాపాడి, దేశాన్ని తిరిగీ వశంచేసుకుని స్వతంత్ర హిందూసామ్రాజ్యాన్ని స్థాపించాలని మహరాష్ట్ర నాయకుడైన శివాజీ కంకణం కట్టుకున్నాడు. కట్టుకొని, ఒక్కొక్క కోటనే వశంచేసుకోవడం ప్రారంభించాడు.

శివాజీకి ఇటువంటి దేశాభిమానం కలగటానికి కారణం ఆతని మాత జిజీబాయి.

జిజీబాయి ప్రతాపగడ కోటలో ఉంటున్నది. ఆ కోటకు కొంచెం దూరంలోనే సింహగడమనే మరొక కోట ఉంది. ఒకనాడు ఏదో ఆలోచిస్తూ అటు చూచేసరికి, జిజీబాయికి ఆ కోటబురుజులు కనపడ్డాయి. ఆ కోట మొగలాయీల వశంలో వున్నది. ఉదయభానుడనే రాజపుత్ర వీరుడు దానిని కాపాడుతున్నాడు. దానిని ఇంకా శివాజీ వశంచేసుకోకపోవటం ఆమెకు నచ్చలేదు. వెంటనే కుమారునికి కబురుచేసింది.

శివాజీ అప్పుడు రాజగడ కోటలో ఉన్నాడు. తల్లి కబురుచేసిందనగానే అతడు గుఱ్ఱం ఎక్కి వచ్చి, ప్రతాపగడం చేరుకుని తల్లికి నమస్కరించి, 'అమ్మా!—ఏమిటి సెలవు?' అన్నాడు.

ఆమె నవ్వుతో, 'నాకిక్కడ ఊబుసుపోవటంలేదు, చదరంగం ఆడుకుందామని పిలిచాను. ఒక్క ఎత్తు వేద్దామా' అన్నది. శివాజీ ఆశ్చర్యపోయాడు. తల్లి కోరిక ప్రకారం ఆటకు కూర్చున్నాడు.

ఆటలో జిజీబాయే నెగ్గింది. 'నేను గెలిచాను కనుక నువ్వు ఏమిస్తావు శివా?' అంది. 'అమ్మా, నువ్వేమి కోరుకుంటే అదే ఇస్తాను' అన్నాడు శివాజీ. ఆమె

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

వెంటనే దూరాన కనబడుతూవున్న సింహ గడ కోటను చూపించి 'శివా, ఆ కోట మహారాష్ట్రుల వశమయేవరకూ నాకు నిద్ర పట్టదు. వెంటనే మన వశం కావాలి!' అంది.

శివాజీ నిర్ఘాంతపోయాడు. 'అమ్మా, ఉదయభానుణ్ణి ఓడించి, కోట వశం చేసుకోవడం సులభమైన పని కాదు' అన్నాడు.

జిజీబాయి వినిపించుకోలేదు. 'ఏమి కోరుకుంటే అదే ఇస్తానన్నావుగా!' అని అతని వాగ్దానం జ్ఞాపకం చేసి లోపలకు వెళ్ళిపోయింది.




శివాజీ తిరిగి రాజగడం చేరుకున్నాడు. కొలువులో ఉన్న వీరుల నందరినీ రప్పించి తల్లి ఆజ్ఞను తెలియపరిచాడు. వాళ్ళంతా ఏకకంఠంతో, 'దీనిని సాధించటానికి ఒక్క తానాజీయే సమర్థుడు' అన్నారు.

అప్పుడు తానాజీ అక్కడ లేడు. కుమారుని పెళ్ళికి తరలివెళ్ళాడు. ఉన్నపళాన రావలసిందని తానాజీకి కబురు వెళ్ళింది.

శివాజీ పంపిన దూత, ఇంకొక ఘడియలో లగ్నం అనగా పెళ్లిపందిరి చేరుకొని ప్రభువుల అజ్ఞ తానాజీకి తెలిపాడు.

'ఆ మూడు ముళ్ళూ పడగానే వెళుదురుగాని' అన్నాడు కన్యాప్రదాత. 'క్షణం కూడా ఆగటానికి వీలు లేదు' అంటూ తానాజీ గుఱ్ఱం ఎక్కి, ఒక్క పరుగున వెళ్ళి రాజగడం చేరుకున్నాడు.

శివాజీ అతనికి రాజమాత జిజీబాయి కోర్కెను తెలియచేశాడు. "'సింహగడం మహారాష్ట్రుల వశమయేవరకూ నాకు నిద్ర పట్టదు' అంది మాతాజీ. నువ్వో నేనో ఇందుకు పూనుకోవాలి."

తానాజీకి శక్యంగాని పని లేదు. 'రాజమాత ఆజ్ఞ పాటించటంకోసం, హిందూ సామ్రాజ్య స్థాపనకోసం ప్రాణమైనా బలి ఇవ్వటానికి నేను సిద్ధంగా వున్నా'నంటూ తానాజీ తన సైనికదళాలకు కబురుచేశాడు. ఆ రాత్రి—సింహగడంలో అంతా గాఢ



నిద్రలోవున్నారు. ఉదయభానుడుకూడా. ఆ సమయంలో సింహగడంచుట్టూ తానాజీ సైనికులు చేరి కోటలో ప్రవేశించటం ఎలాగ? అని ఆలోచిస్తున్నారు.

తానాజీవద్ద ఒక ఉడుము వున్నది. దానిని అతడు 'యశోవంతు'డనే పేరుతో పిలిచేవాడు. దాని నడుముకు ఒక తాడు కట్టి, 'పైకి పొమ్మ'ని ఆజ్ఞాపించేసరికి, అది చరచరా కోటగోడను ఎక్కిపోయింది. అది అలా వెళ్ళి కోటగోడలో ఏదో రాయిని కరిచిపట్టుకోవటం, దాని నడుముకు వేలాడే తాడు దొరకపుచ్చుకుని తానాజీ కోటగోడ ఎక్కి, ఆ తాడును తర్వాత ఏ రాటకో కట్టి, దానిద్వారా ఒక్కొక్కళ్ళనే కోటపైకి రప్పించటం మామూలు. సింహగడాన్నికూడా అలాగే వశం చేసుకోవాలన్న ఉద్దేశంతో తానాజీ 'యశోవంతుణ్ణి' యథాప్రకారం పైకి వదిలాడు.

ఐతే, ఉడుము ఆ రాత్రి మామూలు ప్రకారం పైకి పోయినవెంటనే ఏ రాతినో కరిచి పట్టుకోక వెనక్కి తిరిగి వచ్చేసింది. అది అలాగ తిరిగి వచ్చేసినందుకు తానాజీ కోపంతో దాన్ని కసిరి తిట్టేడు. అతని దండనాయకులలో ఒకడు తానాజీతో 'తగినంత కారణం లేందే ఇది తిరిగిరాదు. కోట



లోపల ఏదో అలికిడైవుంటుంది. ఆ సంగతి తమకు తెలియపరచడానికే అది తిరిగి వచ్చివుంటుంది' అన్నాడు.

'ఏమైనాసరే తెల్లవారేలోగా సింహగడం మహారాష్ట్రుల వశం కాకతప్పదు' అంటూ, ఉడుముతో తానాజీ, 'ఛలో' అన్నాడు. ఉడుము యజమానుని నిశ్చయాన్ని అర్థం చేసుకున్నదానికమల్లే ఒక్కమారు తల ఆడించి చరచరా పైకి పోయి రాతిని కరిచి పట్టుకుంది. ఆ తాడు పట్టుకొని వెంటనే తానాజీ కోటపైకి ఎక్కాడు. మరొక ఘడియలో అతని సైనికులందరూ ఎక్కివచ్చి అతని వెనుక నిలబడ్డారు.

ఉడుము మొదట తిరిగి రావటానికి కారణం వుంది: కోటలోపల పారావాళ్ళ అలికిడి వినపడి, అది యజమానికి ఆ సంగతి తెలియపరచటానికి వచ్చింది. కోట గోడమీద మహారాష్ట్ర వీరుల అడుగుల చప్పుడు వినపడటంతోనే కోటలోపలి పహరా వాళ్ళు కొమ్ము బూరాలు ఊది, లోపలివాళ్ళ నందరినీ లేపేశారు.

అలా లేపిన మరొక్క ఘడియలో ఉదయభానుడు రాజపుత్ర వీరులతోనూ, మొగాలాయీ వీరులతోనూ వచ్చి, తానాజీని ఎదుర్కొన్నాడు. రెండు పక్షాలకూ ఘోర



యుద్ధం జరిగింది. 'భవానీదేవికీ జై శివాజీ మహారాజుకీ జై !'అంటూ ఒక్కొక్క మహారాష్ట్ర వీరుడూ పదేసిమందిని పొడిచి చంపాడు. మొగలాయిసేనకన్న మహారాష్ట్ర వీరుల సంఖ్య తక్కువే. ఐనా, నాటి యుద్ధంలో మహారాష్ట్రులకే విజయం లభించింది. అందుకు కారణం వాళ్ల నాయకుడైన తానాజీయే. ఆ యుద్ధంలో ఎక్కడ చూచినా అతడే కనపడి, జయజయధ్వానాలతో తన వాళ్ల పౌరుషాన్ని పదిరెట్లు పొంగచేశాడు.

ఎదురైన శత్రువుసల్లా కూల్చి, తెల్లవారకుండా సింహగడం వశం చేసుకొన్నాడు. కాని ఆయుద్ధంలో తానాజీకి వంటి

నిండా గాయాలు తగిలాయి. 'నా ప్రాణాలు ఇంక ఎంతసేపో నిలబడవు. నన్ను శివాజీ మహారాజువద్దకు తీసుకుపొండి' అన్నాడు.

'మహారాజే ఇక్కడకు వస్తున్నారు!—' అన్న కంఠస్వరం వినిపించింది తానాజీకి. ఆ గొంతుక, అతని కుమారుడూ పెండ్లి కుమారుడూ ఐన బాబూజీది. 'నాయనా పెండ్లిపీట వదిలి ఎందుకు వచ్చావు?' అన్నాడు తానాజీ.

'మహారాష్ట్రవీరులంతా ఇక్కడ ప్రాణాలు బలి ఇవ్వటానికి వస్తూంటే, తానాజీ కుమారుడు పెళ్ళివిందులకోసం నిలిచిపోతాడా? అసంభవం!' అన్నాడు బాబూజీ. అమాటకు తానాజీ సంతోషించాడు. 'నా తరువాత మహారాజును భక్తివిశ్వాసాలతో సేవించు. దేశంకోసం ప్రాణమైనా అర్పించు' అన్నాడు.

అంతలో శివాజీ అక్కడకు చేరుకొన్నాడు. 'మహారాజ్, సింహగడం మహారాష్ట్రుల వశం చేసివేశాను. రాజమాత కోరిక చెల్లింది' అంటూ, ఆ మహావీరుడు శివాజీ ఒడిలోనే ప్రాణాలు వదిలేశాడు.

తానాజీ పోవటంతోనే శివాజీ బాలునికి మల్లే యేడ్చాడు. శివాజీ వెళ్ళి 'అమ్మా, సింహగడం దక్కిందిగాని సింహం పోయింది!' అని విలపించాడు.

జిజీబాయి కుమారుణ్ణి ఓదారుస్తూ, "శివా, తానాజీ అశాశ్వతమైన దేహాన్ని మాత్రమే వదిలాడు; శాశ్వతమైన కీర్తిని గడించి తక్కిన మహారాష్ట్రులందరకు మార్గదర్శకు డయ్యాడు!" అంది.

"తానాజీ ఏ మహారాష్ట్రంకోసం ప్రాణాలర్పించాడో, ఆ దేశంకోసమే నువ్వు నీ ప్రాణాలు నిలుపుకోవాలి. ధైర్యం వహించు. లే. బాబూజీ వివాహాన్ని మనం వెళ్లి చేయించాలి" అంది జిజీబాయి. శివాజీ బాబూజీకి కొన్ని జాగీర్లను కానుకలుగా ఇచ్చి, వంశ పారంపర్యా రాజదర్బారులో గౌరవం జరిగే హక్కులు ప్రసాదించాడు.






సుమారు రెండువందల యేళ్ళ క్రిందట మళయాళ దేశంలోని 'తాలంగోడు' గ్రామంలో పార్వతమ్మ అనే ఒక ఇల్లాలు ఉండేది.

ఆమె భర్త 'రామకుట్టి' అనే ఆయన రాజాస్థానంలో ఒక ఉద్యోగి. ఒకసారి అతను ఆస్థానంలోకి వెళ్ళాడంటే తిరుగా ఇంటికి ఎప్పుడు వస్తాడో చెప్పటం కష్టం. ఆ వుద్యోగమే అటువంటిది. అందుచేత, అటువంటప్పుడు ఇంటిదగ్గర పార్వతమ్మ ఒక్కర్తే కాలం గడపవలసివచ్చేది.

పార్వతమ్మకు సుబ్రహ్మణ్యేశ్వరుడంటే చాలా భక్తి. ఊరువెలుపల గల సుబ్రహ్మణ్య ఆలయానికి పోయి, రోజూ ఆమె మైమరచి ప్రార్థన చేసుకునేది. 'స్వామీ, సుబ్రహ్మణ్యా! దర్శన మిప్పించవా? నేను సమర్పించే ఈ ప్రసాదాలు స్వీకరించవా?' అని చెప్పి దేవుణ్ణి మరిమరి వేడుకొనేది.

ఇలా ఆమె రోజూ ప్రార్థించటం గుడిలో పూజారి కనిపెట్టుతూ, ఆమె అమాయకత్వానికి లోలోపల నవ్వుకొనేవాడు. ఒక రోజున ఆమె మామూలుప్రకారం ప్రార్థిస్తూ వుండగా పూజారి, విగ్రహంవెనుక దాగొని వుండి, 'భక్తురాలా! నీ సేవకు మెచ్చాను. ఇవాళ పొద్దుగ్రుంకే సమయాన నీ కోరిక తీరుస్తాను' అని పలికాడు.

ఇవి కేవలమూ ఆ స్వామివారు పలికిన పలుకులే అని నమ్మి, పార్వతమ్మ చాలా సంతోషించింది. వెంటనే ఇంటికి చేరుకొని, భక్తికొద్దీ ఇల్లు శుభ్రం చేసుకొని పంచభక్ష్య పరమాన్నాలు తయారుచేసి, స్వామికోసం వేచివున్నది.

అంతలో సాయంకాలం అయేసరికి, ఒక భిక్షకుడు—వాళ్లనే ఆదేశంలో 'పండారం' అంటారు—'జై-సుబ్రహ్మణ్యా!' అంటూ వచ్చాడు. అతనిని చూడగానే పార్వతమ్మ

యస్. శేషమాంబ




స్వామి ఈరూపంతో వచ్చాడనుకొని, 'రండి, స్వామీ, రండి, ఈ దీనురాలి ఆతిథ్యాన్ని స్వీకరించండి!!' అంటూ పిలిచింది. వాడు ఆశ్చర్యపోయాడు. 'నేను భిక్షకుణ్ణి' అన్నాడు. ఎంత చెప్పినా ఆమె వినక, నిర్బంధించేసరికి, గత్యంతరం లేక వాడు లోపలికి వెళ్ళాడు.

ఆ భిక్షకుణ్ణి పీటవేసి కూర్చోబెట్టి, చక్కగా భిక్ష చేసింది పార్వతమ్మ. దొరికిందే చాలునని వాడు బాగా ఆరగించాడు. ఐతే, ఎవరైనా వచ్చి, ఈ రూపంలో వున్న తనను చూస్తే ప్రమాదమని ఒకవంక భయపడుతూనే, వాడు భోజనం పూర్తిచేశాడు.



భిక్షకుడు భోజనం చేస్తూన్నంతసేపూ ఆమె భక్తికొద్దీ గానం చేసింది. అంతలో పొద్దు గ్రుంకటం చూచి, పార్వతమ్మ దీపారాధన చేసింది.

అప్పుడు 'ఓ నా భక్తురాలా!—తలుపు తియ్యి' అనే పిలుపు వినపడింది. చూడగా-విభూతిరేఖలు దండిగా ధరించిన గుడి పూజారి-ప్రత్యక్షమయ్యాడు. 'ఓహో, ఇప్పుడు వచ్చిన ఈయనే నిజంగా స్వామి. ఇంతకుముందు వచ్చినది బిచ్చగాడే...' అనుకొని, 'పండారా'న్ని చీకటిగా వుండే అటకపైన దాక్కోబెట్టింది పార్వతమ్మ.

పూజారిని ఎంతో భక్తితో లోపలికి పిలుచుకువచ్చి, అతనికి సమస్తమైన ఉపచారాలు చేసి, సత్కరించింది. ఇప్పుడు కూడా ఈ స్వామి మెచ్చుకోవాలని ఆమె భక్తితో గానంచేసింది.

ఆ సమయాన బైట, గుర్రం వచ్చే శబ్దం వినిపించింది. చూస్తే, ఆ గుర్రంమీద దిగిన వాడు ఆమె భర్తే! వెంటనే ఆమె పూజారి దేవుడికి నమస్కరించి 'స్వామీ!—నా భర్తకు దేవుడంటే విశ్వాసం లేదు. పైగా చాలా కోపిష్ఠి. వారు శాంతించేవరకూ మీరు కాస్త ఆ అటకమీద ఉండండి!' అంటూ, అతనినికూడా దాక్కోబెట్టింది.





ఎటు పారిపోదామన్నా దోవా తెన్నూ కనబడక, పూజారికూడా అటక ఎక్కి ఒక పక్కన పడుకున్నాడు. పండారానికి కడుపు నిండింది కనుక, ఇట్టె నిద్ర పట్టేసింది. వాడు మరొకమూల ఉండటంచేత, పూజారి వచ్చిన సంగతి వాడికి తెలియదు. మరి కొంచెంసేపటికి పూజారికీ నిద్రపట్టేసింది.

పార్వతమ్మ భర్త భోజనంచేస్తూ 'ఇదంతా ఏమిటి, ఈ అట్టహాసం!' అని అడిగాడు. అందుకామె 'మీరివాళ వస్తారని నాకు రాత్రి కల వచ్చింది. అందుకనే ఇవన్నీ చేశాను' అని సర్దిచెప్పింది. అతడు సంతోషించి, విశ్రాంతి తీసుకొని, వెంటనే పడుకొన్నాడు.

అర్ధరాత్రి అయింది.

పొట్టనిండా అపూర్వమైన భక్ష్యాలు పట్టించిన పండారానికి దాహంవేసింది. 'మంచినీళ్ళు! మంచినీళ్ళు!!' అని పెద్దగా అరిచాడు. ఈ అరుపు చెవినిబడి పార్వతమ్మ భర్తకు మెలకువ వచ్చింది. 'ఏమిటది?' అని అడిగాడు.

ఇందుకు ఆమె 'మనం, మరి పితృదేవతలకు చేయవలసిన కర్మలు ఆచరించటంలేదుకదా. అందుకనే వాళ్ళు రెండు రోజులాయె ఇలా ప్రత్యక్షమవుతున్నారు!'




అని యుక్తిగా సమాధానం చెప్పింది. అప్పుడు రామకుట్టి చేతులు జోడించి, పైకి చూస్తూ 'ఓ పెద్దలారా!—ఇటుపైన మీకు జరపవలసిన కర్మకాండలన్నీ యథావిధిగా తప్పక జరిపిస్తాము. మన్నించండి' అంటూ ప్రార్థించాడు.

అక్కడ పండారానికి గొంతు ఎండుకపోవడంచేత, 'నీళ్ళు! నీళ్ళు!!' అని మళ్ళీ ఒకసారి అరిచాడు.

పార్వతమ్మ అప్పుడు అటకవైపు తిరిగి, 'ఓ దైవమా! తూర్పుదిక్కున టెంకాయ వున్నది. అక్కడనే రుబ్బురాయి వున్నది. దానితో కాయకొట్టుకొని ఆ నీళ్ళు తాగి,



శాంతించు!' అన్నది ప్రాధేయపడుతూ. ఈ మాటలోని అర్థాన్ని గ్రహించిన పండారం అటకమీద తూర్పుదిక్కున వెతకగా, చెప్పినట్టుగానే టెంకాయ దొరికింది. తరువాత రాయికోసం వెతికేసరికి, పండుకొనివున్న పూజారి గుండు ఆ చీకటిలో చేతికి తగిలింది. అదే రాయి అనుకుని పండారం వెంటనే టెంకాయను దానిమీద కొట్టాడు.

తల చితికేసరికి 'అయ్యో! అయ్యో!' అంటూ పూజారి గోల పెట్టాడు. ఏమీ తెలియక, ఆచీకటిలో కంగారుతో తడుములాడేసరికి, అతనికి పండారం చెయ్యి దొరికింది. ఇద్దరూ కలియబడ్డారు.

కింద వున్న రామకుట్టి ఈ గోల విని భయపడ్డాడు. పార్వతమ్మ హడిలిపోతూ 'హయ్యో, దేవతలకు ఇవాళ ఉగ్రం వచ్చేసినట్టుంది. రోజూ మీరు వచ్చేవరకూ శాంతంగా ఉండండి అని వేడుకొంటే అలానే ఉండేవాళు. ఇవాళ మీరు వచ్చారని తెలిసి కాబోలు, వాళ్ళు ఆగ్రహం చెందినట్టుంది' అని చెప్పింది.

అంతలో అటుకపైనుంచి వాళ్ళిద్దరూ దభీమని కింద పడటం చూచాడు రామకుట్టి. చూచి, హడులుకొంటూ, గుర్రం యెక్కి ఫుడాయించాడు. ఆ తొందరలోనూ కంగారులోనూ అతను కమ్చీతో గుర్రాన్ని కొడుతూవుంటే, కమ్చీ కొస అతనికే వీపు మీద తగులుతూవచ్చింది.

ఇది చూచి ఆ దేవతలే తనను వెంటాడుతున్నారనుకొని, 'బాబూ! నన్ను విడిచిపెట్టండి! మీకు ఏటా చేయవలసిన కర్మలన్నీ చేస్తా!' అని బతిమలాడుకొంటూ పోసాగాడు.

ఈ అదనులో పండారమూ, పూజారీ వాళ్ళదారిని వాళ్ళు వెళ్ళిపోయారు.

ఏం చెయ్యగలదు పాపం, పార్వతమ్మ! నమ్మిన దేవుళ్ల లీలలకు విస్తుపోయింది. ఆమె భక్తి చివరకు ఇలా ఫలించింది.






దళసరిగా వుండే అట్ట ఒకటి తీసుకో. దానిని ఒకటవ బొమ్మలో చూపినట్లు కత్తిరించు. ఆ అట్ట ముక్కకి ఒక వైపు చిలుకబొమ్మను వెయ్యి.

అట్టముక్కను రెండవ పక్కకు తిప్పి పంజరం బొమ్మను తల క్రిందుగా గీయి. (రెండవ బొమ్మలో మోస్తరుగా.)

తరువాత అట్టముక్కకి బొమ్మలో చూపించిన చోట్ల రెండు బెజ్జాలు ఏర్పరుచు.

అలా ఏర్పరిచిన ఆ రంధ్రాల గుండా రెండు పొడుగు పాటి దారపు ముక్కలు దూర్చు (మూడవ బొమ్మలోలాగ). దారపు ముక్కల రెండు చివరలనూ రెండు చేతులతో పట్టుకొని దారానికి పురెక్కించి వదిలిపెట్టు.

ఇప్పుడు అట్టముక్క కింది నించి మీదికి గిరగిరా తిరుగుతుంది. పంజరం బొమ్మా చిలుక బొమ్మా అట్టకి చెరొక పక్కా ఉన్నప్పటికీ, అట్టముక్క గిరగిర తిరగడంలో రెండు బొమ్మలూ ఒకే వైపు ఉన్నట్లు అనిపించి పంజరంలో చిలుకబొమ్మ కనిపిస్తుంది (నాల్గవ బొమ్మలో మాదిరిగా).




—తాతా వెంకటరమణ




సంతకు బోయిన సుబ్బయశెట్టి
సరకుల సంచులు నింపుకొని
అల్లన 'గొల్లలవాగు'ను చేరి
'సంగడి'కోసం చూచాడు.
కార్తికమాసపు కారుమబ్బులకు
కడవలపోతగ కురిసిన వర్షం
కనుమల, కొండల, గుట్టల దాటి
నింపెను వాగును నిలువుల బంటిగ.
చెట్లు గుట్టలను నెట్టుకొని
కట్టలు తెంచిన వేగముతో
పచ్చని చేలపు వాలులగుండ
తెచ్చెను వరదల 'గొల్లలవాగు'కు.
'సంగడి'కోసం చూచుచు సుబ్బయ
సంచులు క్రిందకు దించుకొని
చూపుదూరమున 'సంగడి' కానక
చతికిలబడియెను సరకులపై.
చుక్కలు పొడిచే సమయము మీరిన
'సంగడి' చేరిన జాడలు లేవు
గట్టులు నిండిన వాగును దాటే
గమనము తోచక చూచుచునుండె.
నిలువున నీరై నిలచిన శెట్టికి
నీడను పోలిన రూప మదేదో
చల్లన కదలుచు నీటిఅలలపై
దొంతర, దొంతర తిరుగుచు వచ్చె.
రూపము చూచిన సుబ్బయశెట్టి
'సంగడి' గట్టును చేరెనటంచు
సంచులు చంకను బెట్టుకొని
చల్లగ రేవులగట్టును చేరెను.
'సంగడి'కాదది, గింగడి కాదు
వాగుల వేగపు దాడికి ఆగక

కె. ఎస్. రామశర్మ

(వ్రేళ్ళను తెంచుక నీటను బడిన
నల్లని తుమ్మకర్రల చెట్టది.
చెట్టును చూచిన సుబ్బయశెట్టికి
తొట్టలు వేసిన చెడ్డమనస్సు
గట్టుల తెంచుక పారిన ఏరుగ
పట్టు విడచి పరుగెత్తింది.
చెడ్డగ నమ్మిన దొడ్డగు దుడ్డు
వడ్డికాసులతొ సంచిన చేరు
గొడ్డలి కొట్టిన పేళ్ళకుకూడ
దుడ్డుకు చావే లేదనుచు.
కళ్ళెము విడిచిన గుఱ్ఱమువోలె
వళ్ళు పులిసిన తలపులతో
వళ్ళుతెలియని పరవశమందు
"ధం"మ్మని నీటను దూకాడు.
చావు బ్రతుకులుగ చెట్టును చేరి
చేతుల కొమ్మల గట్టిగ పట్టి
చెట్టుతొ పాటుగ మునుగుచు, తేలుచు
కొట్టుకపోయెను వాగులగుండ.
కొట్టుకుపోవుచునుండిన శెట్టికి
కొంచెము దూరము ఏగగనే
కాంచన గర్భపు దేవతవోలె
గట్టొక టడ్డము వచ్చింది.
గట్టును గట్టిగ పట్టుకొని
చెట్టును బయటకు లాగాడు
గుట్టుగ చెట్టును కొట్టించేసి
కొట్టుకు చేర్చి అమ్మాడు.

*　　　*　　　*

అమ్మిన గుట్టును తెలిసిన కొందరు
సొమ్మును చేసిన శెట్టిని చూచి
'లాభము లేదె వరదను దూకున?'
లోభివానికే లాభ మెప్పుడని
లోకపు తీరుకు కుమిలారు.



# ముగ్గురు నేస్తాలు (రంగులబొమ్మ కథ) - 2

తీరా చూస్తే—అ వచ్చింది కురపన్న తల్లి. 'తలుపు తీయరా నాయనా!' అంది. కురపన్న తలుపు సందులోనించి మెల్లగా "నేస్తాలతో ఆడుకొంటున్నానమ్మా!" అన్నాడు.

"నేస్తాలు—నేస్తాలు అంటున్నావు. వాళ్ళు మంచివాళ్ళేనా?" అని మళ్ళీ అడిగింది వాళ్ళమ్మ. "ఓ. చాలా మంచివాళ్ళు" అన్నాడు కురపన్న.

"అలా కాదురా అబ్బాయీ!—అడవిలో అందరూ మనకు నేస్తాలు కారు. నిజమైన నేస్తాలు కొద్దిమందే ఉంటారు. నీ నేస్తాలలో మోసకారి మొసలి లేదుకద?' అన్నది. "లేదు" అన్నాడు కురపన్న నవ్వుతూ. "నమ్మరాని నల్లచిరుతపులి లేదుకద?" అని మళ్ళీ అడిగింది. "ఊహుఁ" అన్నాడు కురపన్న. "పగబట్టే పాము లేదుకద?" అని ఇంకా అడిగింది. "లేదమ్మా. లేదు" అన్నాడు కురపన్న. "కలివిడైన కోతి, చిత్రమైన చిలుకా, కమ్మగా పాడే కోవిలా నా నేస్తాలు" అన్నాడు.

కురపన్న నేస్తాలతో ఆడుకుందామనుకొని వాటిని కూర్చోమన్నాడు. కాని, ఎంత చెప్పినా కోతికి కుదురు లేకపోయింది. అది ఒకచోట ఇమిడికగా కూర్చోలేదు. చెంగు చెంగుమని గెంతులేసింది. ఉట్టిలెక్కింది. దాని గంతులకు పాలు, మజ్జిగలు ఒలికిపోయినై. తట్టలు తిరగబడినై. ఇలా చిందరవందర చేసి, ఇల్లు తిని పందిరి వేసేటంతటి అల్లరిచేసింది!

కోతి చేసే అల్లరికి కురపన్న భయపడ్డాడు. వాళ్ళ అమ్మా, నాన్నా వచ్చి కోప్పడతారేమోనని హడలిపోయాడు. ఎంతగానో చెప్పిచూచాడు కోతినేస్తానికి. కాని, చెప్పినకొద్దీ కోతిచేష్టలు మరీ ఎక్కువయినై.

"కోతీ! కోతీ!! ఇవన్నీ ఇంట్లో ఆడే ఆటలు కావు. వాన తగ్గినతరువాత అవతల పెరట్లోనూ చెట్లమీదా ఆడుకొందాం" అంటూ నచ్చచెప్పాడు.

అంతలోనే మన కోతికి ఇంటిబయట, కోతిమూకల కిచకిచలు వినిపించినై. అది కురపన్న నేస్తాన్నికదా అనే మాటనే మరిచిపోయింది. 'మావాళ్ళంతా ఎక్కడికో పోతున్నారు. చూడాలి' అంటూ. గుడిసెలోనించి గభీమని దూకి, మూకలో కలిసిపోయి, అడవులంట ఎక్కడికో పోయింది. పోతే, గుడిసెలో—తక్కిన సంగతి సందర్భాలు—




పూర్వకాలమందు, మారవాడదేశంలో పుంగళ అనే పట్టణానికి పింగళు డనే రాజు ఉండేవాడు. ఆ దేశంలోనే మరి ఒక పట్టణం ఉన్నది. ఆ పట్టణానికి రాజు సామంతసింహుడు.

సామంతసింహునికి ఉమాదేవి అనే చక్కదనాల కూతురున్నది. పింగళుని శక్తిసామర్థ్యాలు వినివున్న సామంత సింహుడు తన కూతురును ఇచ్చి పెళ్ళిచేస్తానని పింగళుడికి కబురు పంపాడు.

ఐతే, అంతకుముందే ఉమాదేవిని గుజరాతిదేశంలో ఉండే పాటణరాజుకూ జునాగఢరాజుకూ ఇయ్యాలెనని ఒకప్పుడు నిశ్చయమయివుంది. కానీ, రాణిమటుకు తన కూతురును గుజరాతీ దేశంలో ఇవ్వటానికి ఎంతమాత్రమూ ఇష్టపడలేదు.

అందుచేత. ఎమనుకొన్నాసరే అనుకొని, రాణి తనభర్తతో 'గుజరాతిదేశంలో నాబిడ్డను నేనిచ్చేదిలేదు' అని నిష్కర్షగా చెప్పింది. చెప్పినంత మాత్రాన లాభమేముంది?– ఒకసారి వాగ్దానం జరిగివున్నదాయె. తప్పుకొవటం అంత తేలిక కాదుకదా! అయితే, ఆమె తెలివిమంతురాలు కావటంచేత ఒక చక్కటి ఉపాయం పన్నింది: పాటణ రాజు ప్రయాణంచేసి రావటంలో, ఇక్కడికి సమయానికి చేరుకోవీలు కానట్టుగా సుముహూర్తం పెట్టించింది.

ఆమె పెట్టించినటువంటి ఆ సుముహూర్త సమయానికి అక్కడ పింగళుడు ఒక్కడే ఉన్నాడు. ఈ అదునులో వారి ఇష్టప్రకారం ఉమను ఆ రాజుకిచ్చి పెళ్ళిచెసేసారు.

ఉమాదేవికి పెళ్ళి అయిన కొద్ది కాలానికే 'మారువాణీ' అని ఒక కూతురు పుట్టింది. ఆమెను 'మారూ' అని ముద్దుగా పిలిచేవారు. ఆ పిల్ల యేణ్ణర్థం వయస్సులో ఉండగా, ఆ దేశాన గొప్ప కరువు పట్టింది.

సి. నారాయణరావు



కాటకానికి భయపడి, పింగళుడు తన భార్యా బిడ్డలతేనూ, ప్రజలతోనూ దేశం విడిచి పుష్కరతీర్థానికి వెళ్ళాడు.

ఆ తీర్థానికి 'నలపిరఘుడం' పాలించే 'నలుడు' అనే రాజు యాత్ర చేసుకొంటూ, తన రాణితోనూ, మూడేండ్ల ప్రాయపు కొడుకుతోనూ అక్కడికి వచ్చాడు. ఆ పిల్ల వాని ముద్దుపేరు 'ఢోలా.'

అక్కడ నలుడికి పింగళుడికీ స్నేహం కుదిరింది. ఆ స్నేహం ఎంత గాఢమయిందంటె—యేణ్ణర్థం వయస్సుగల మారూను, మూడేళ్ళ ఢోలుడి కిచ్చి పెళ్ళిచేశారు! ఆ తరువాత నలుడు, తన రాణితోనూ కొడుకుతోనూ తన రాజ్యానికి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోవటం బాగానే వుంది. కాని, చిత్ర మేమిటంటే—ఎక్కడో దూర దేశాన, తన రాజ్యంకాని రాజ్యంలో ఈ సంఘటన జరగటంచేత కొంత కాలానికి ఈ మాటనే మరిచిపోయాడు ఆ రాజు.

ఢోలుడు పెరిగిపెద్దవాడయ్యాడు. తనకు పెళ్ళిఅయిన సంగతి వానికి తెలియనే తెలియదు. తరువాత వానికి మాళవదేశ రాజకుమార్తె అయిన 'మాళవణి' అనే అమ్మాయిని ఇచ్చి పెళ్ళి చేశారు.

* * *

ఢోలుడికి గుర్రాలంటే చాలా ఇష్టం. జాతి ఐన గుర్రాలను ఎందరెందరో దేశ దేశాలనుంచి ఢోలునివద్దకు తీసుకువచ్చే వారు. అలానే ఒకప్పుడు గుర్రాలను అమ్మే వాడొకడు మాళవదేశంనుండి వచ్చి, ఢోలు నికి కొన్ని మేలుజాతి అశ్వాలను చూపించి విక్రయించాడు.

ఆ అశ్వవర్తకుడే మరి కొంతకాలానికి పుంగళపట్టణం పోయి పింగళునితో, తమ రాజుగారి కూతురును ఫలానా ఢోలుని కిచ్చి పెళ్ళిచేశారనే వార్త చెప్పాడు. ఈ సంగతి వెంటనే రాజపుత్రి మారూకి తెలిసింది. బాల్యమందే తలిదండ్రులు ఆమెకు

ఢోలునితో పెళ్ళి అయిన సంగతి చెప్పటం చేత, ఆమె పెద్దవవుతున్నకొద్దీ ఢోలుడే తనకు మగడని నమ్ముకొని, వానిమీదనే మనసు పెట్టుకొని ఉన్నది.

ఇప్పుడు గుర్రపువర్తకుడు వచ్చి ఈ సంగతి చెప్పగానే ఆమె దుఃఖంలో మునిగి పోయింది.



అక్కడ, నలవీరఘుడ రాజ్యంలో సంగతిసందర్భాలు ఎలా వున్నాయంటే—

ఢోలుని తల్లి ఒకనాడు నోరుజారి, చిన్నతనంలో మారూను ఇచ్చి పెళ్లిచేసిన సంగతి కొడుకుఎదట చెప్పింది. ఆ మాట విని మాళవణి సవతిమీద కోపం తెచ్చుకొన్నది.

పుంగళరాజ్యంనుంచి మారూ దూతలను పంపించింది. మారూ పంపిన సందేశం ఢోలునికి చేరకుండా చేసింది మాళవణి.

తన దూతలు తిరిగి రాలేదు ఏమా అని నిరాశచెంది పింగళుడు ఆశ్చర్యంపొందాడు. మారూ మాత్రం అంతటితో ఊరుకోలేదు. కొంతమంది భట్రాజులద్వారా ఢోలునికి మళ్లీ తన సందేశం పంపించింది. వారు నలవీరఘుడం వెళ్ళి ఢోలునితో మాటాడారు.

నిజానిజాలు ఎప్పుడైతే వెల్లడయినయో, తక్షణమే పుంగళకు పోవటానికని ఢోలుడు వేగిరపడి బయులుదేరాడు. 'అక్కడికి వెళ్లవద్దు' అని మాళవణి భర్తను బతిమాలుకుంది. ఢోలుడు వినలేదు. అప్పుడు మాళవణి, ఢోలుడు ఎక్కి వెళ్ళే ఒంటెతో రహస్యంగా "ఒంటే, ఒంటే!—కుంటిగా వున్నట్టు నటించే. నామీద కనికరించే" అన్నది. కాని, ఆమె కోరిక ఫలించలేదు.

చివరకు మళ్ళీ భర్తవద్దకు వచ్చి 'పోనీ, నేను మేలుకొనివున్నప్పుడు పోనని మాట ఇవ్వండి' అని దీనాలాపాలాడింది మాళవణి. ఢోలుడు ఈ మాటకు ఒప్పుకొన్నాడు.

భర్త వెళిపోతాడేమోననే భయంతో అప్పటినుంచీ మాళవణి నిద్రపోవటం మాని వేసింది. కాని, నిద్ర లేకుండా ఎన్నాళ్ళని

ఉండగలమ? ఒకనాడు ఆమెను నిద్రాదేవి ఆవహించింది. ఈ సమయం చూచి ఢోలుడు వెళిపోయాడు. కొంతసేపటికి మాళవణి లేచింది. ఢోలుడు వెళ్ళిన సంగతి తెలుసుకొని ఎంతగానో దుఃఖించింది.

తరువాత ఒక చిలుకచేత తన మగనిని తిరుగా రమ్మని కబురుపంపింది. చిలుక పోయి ఢోలునితో చెప్పేసరికి, ఢోలుడు ఉగ్రుడై, 'పోయి ఇన్ని కట్టెలు పోగుచేసి, మంట పెట్టి, మాళవణిని అందులో పడి చావుమను' అన్నాడు.

కాగా, ఢోలుడు పుంగళపట్టణం చేరుతూ వుండే సమయాన, చంకలో కడవ పెట్టుకొని నీళ్లకు వెళుతూవున్న మారూ అతని కంటబడింది.

మాటల సందర్భంలో వారు ఒకరి నొకరు గుర్తించుకొన్నారు. ఇద్దరూ కలిసి ఇంటికి వెళ్ళారు వీరిని చూచి మారూ తలి దండ్రులు ఎంతగానో సంతోషించారు.

మారూ తల్లివద్దకు వెళ్లి 'అమ్మా. ఎవరి కోసమైతే నేనింతకాలంనుంచీ కనిపెట్టుకొని వున్నానో. ఆ నా దైవం నేటికి ప్రత్యక్షమయారు. ఇల్లు నవ్వుతున్నది. స్తంభాలు నాట్యంచేస్తున్నవి. మంచాలు ఆనందంతో గిర్రున తిరుగుతున్నయి' అన్నది.

కొన్నాళ్లీవిధంగా సంతోషంగా గడచిన తరువాత, మారూను వెంటబెట్టుకొని ఢోలుడు తన దేశానికి బయలుదేరాడు.

పిన్నవాడైనా, ఢోలుడు మంచి యుక్తిపరుడు. సమయం తెలిసి మసులుకో గలడు. తన రాజ్యం చేరుకొన్నాక తల్లినీ తండ్రినీ సమాధానపరిచి, భార్య ఐన మాళవణిని బుజ్జగించి. అందరినీ సంతోషపెట్టాడు అప్పటినించీ మారూనూ, మాళవణిని ఢోలుడు సమానంగా చూచుకొంటూ, వారితో అచ్చికబుచ్చికలాడుతూ వుంటున్నాడు. మాళవణి, మారూలుకూడా స్నేహభావంతో మెలగుతూ వచ్చారు.



# చందమామ కథల పోటీ

## బహుమానం రు. 50/-లు



★ చందమామ పాఠకు లందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.

★ పోటీకి పంపే కథ పాతకాలంనాటికి చెందినదైనాసరే, ఈనాటిదైనాసరే— ఇంతకుముందు ప్రచురింపబడని కొత్త ధోరణిలో వుండాలి. కథ శుభాంతం కావచ్చు. దుఃఖాంతం కావచ్చు. సాహసకృత్యమై ఉండవచ్చు, సున్నితమైన హాస్యఫక్కిలో సాగవచ్చు.

★ ఒక్కొక్కరు ఎన్ని కథలైనా పంపవచ్చు. కథ చందమామలో 8 పేజీలకు మించకూడదు.

★ పోటీకథలు 1954 మార్చి 15-వ తేదీలోగా మాకు చేరాలి. ఆటుతరువాత అంగీకరింపబడవు.

★ మేము ఎన్నుకున్న ప్రతి ఒక్క కథకూ రు. 50/-లు బహుమతి ఇవ్వబడును. తక్కిన కథలలోకూడ అర్హమైనవాటికి యథోచితమైన పారితోషికా లివ్వబడును.

★ బహుమతి పొందిన కథలు వీలువెంట చందమామలో వెలువడును. వెలువడిన తరువాత బహుమానం పంపబడును.

★ బహుమతి పొందిన కథల హక్కులన్నీ 'చందమామ'వి. కథలు ఎన్నుకొనుటలో చందమామ సంచాలకునిదే తుదినిర్ణయం. ఇందును గురించి ఎట్టి ఉత్తరప్రత్యుత్తరములూ జరుపబడవు.

కథలు పంపవలసిన చిరునామా:

**చందమామ కథల పోటీ :: వడపళని :: మదరాసు-26.**

# ముచ్చటైన ఐదు టైపు చిత్రాలు















# పదహారువేల రూపాయలు

గన్నవరంలో గవర్రాజు ఒక గృహస్థు. వెంకటేశం, శోభనాద్రీ అని ఆయనకు ఇద్దరు స్నేహితులు ఉండేవారు.

గవర్రాజు ధనవంతుడు. ఈ సంగతి కనిపెట్టే వెంకటేశం, శోభనాద్రీ ఆయనతో స్నేహం చేశారు. 'మీ డబ్బును పెట్టెలో పెట్టి దాస్తే యేమిటి లాభం? దాన్ని పెట్టు బడిగా పెట్టి వ్యాపారం చేస్తే, రూపాయకు పదిరూపాయలు చొప్పున లాభం వస్తుంది' అని సలహా చెప్పారు. 'నాకు ఏ వ్యాపారమూ చేతకాదు' అన్నాడు గవర్రాజు. 'మీరు పెట్టుబడి పెట్టండి. వ్యాపారమంతా మేము నడుపుతాము' అన్నారు వాళ్ళు.

గవర్రాజుగారి సొమ్ముతో వ్యాపారం ప్రారంభమయింది. స్నేహితుల నిద్దరినీ నమ్మి, ఆయన అంతా వాళ్ళపైన వదిలి పెట్టేశాడు. వాళ్లు అసలూ, లాభమూ అపహరించివేసి, వ్యాపారంలో నష్టం వచ్చిందని చెప్పి ఆయనను దివాలాతీయించారు.

తన సొమ్ము అపహరించి, చెరిపక ఐదు వేలూ బ్యాంకులో వేసుకున్నారని గవర్రాజు గారికి ఆఖరునగాని తెలిసింది కాదు. వారు తనకు ద్రోహంచేశారని తెలిసీకూడా ఆయన వాళ్ల నేమీ అనలేదు. వాళ్ళను ఎప్పటిలాగా స్నేహభావంతోనె చూస్తూవచ్చాడు.

కొంతకాలానికి ఆయన ఇ జబ్బుచేసి మంచంపట్టాడు. ఇంక ఎన్నాళ్ళో బ్రతకనని తోచి ఆయన శోభనాద్రిని రమ్మని కబురు పంపించాడు. అతడు రావటంతోనే ఆయన, 'శోభనాద్రి! నువ్వు నాకొక ఉపకారం చెసి పెట్టాలోయ్' అన్నాడు.

'ఏమిటి?' అని అడిగాడు శోభనాద్రి.

'నారోజులు దగ్గిరపడ్డాయి. నేను పోయే ముందు ఏ సొమ్ము యెక్కడ వున్నదీ నా

వై. జయలక్ష్మి



భార్యకు చెప్పవలసిన సమయం వచ్చింది. కాని, మా ఆవిడ వట్టి దుబారామనిషి. సొమ్ము చేతికి వస్తే మూడునిమిషాలలో ఖర్చు చేసేస్తుంది' అన్నాడు.

ఆయనవద్ద ఇంకా సొమ్ము వుండని తెలవటంతో శోభనాద్రికి నోరూరింది. 'ఇన్నాళ్లనుంచీ చెప్పాడుకాడే!' అనుకుని, "నిజమే. 'ఆడవాని చేతి అర్థమూ, మగవాని చేతి బిడ్డా మన్నవు' అన్న సామ్యం ఊరికే పుట్టిందా ?" అన్నాడు.

'వ్యాపారంలో పోయింది పోగా నావద్ద ఇంకా పదహారు వేలదాకా వుంది. ఆ రూపాయలను వెయ్యి వెయ్యి చొప్పున ముంతలలో పోసి, మాయింటి నాలుగు గదులలోనూ ఒక్కొక్క ముంత ఒక్కొక్క మూలని పాతిపెట్టాను. పదహారు ముంతలున్నాయని నా భార్యకు ఒక్కమాటుగా తెలియనివ్వకూడదు. నువ్వు చెయ్యవలసిన ఉపకారమేమిటంటే -' అని వూరుకొన్నాడు గవర్రాజు.

'చెప్పండి, చెప్పండి!' అంటూ తొందర పెట్టాడు శోభనాద్రి.

'మధ్యమధ్య మా యింటి పరిస్థితులు కనుక్కుని వెడుతూ ఉండు. నా భార్య డబ్బు లేక ఇబ్బందిపడుతోంది అని తెలియటంతోనే ఒక ముంత మాట చెప్పి ఆ సొమ్ము తవ్వుకొమను. ఆ సొమ్ము పూర్తి అయే వరకూ దానికి తక్కిన ముంతల మాట చెప్పవద్దు' అన్నాడు గవర్రాజు.

'ఈ ముంతల రహస్యం నువ్వు ఎవరికీ తెలవనివ్వకూడదు. వెంకటేశానికికూడా చెప్పకు. వాడంటే నాకు నమ్మకం పోయింది. అందుకే నీతో చెప్పి, ఈ ఉపకారం చెయ్యవలసిందని కోరుతున్నాను' అనికూడా అన్నాడు గవర్రాజు.

'తప్పకుండా చెస్తాను. మీరు నన్ను నమ్ముకుని ఇంక నిశ్చింతగా ఉండవచ్చు. ఈపాటి దానికేనా ఇంత ఆత్రం!' అని చెప్పి, శోభనాద్రి వెళ్ళిపోయాడు.




ఆ సాయంత్రమే గవర్రాజుగారు రెండవ స్నేహితుడైన వెంకటేశాన్ని రప్పించి, ఆ ముంతల రహస్యాన్ని వాడితోకూడా చెప్పి, శోభనాద్రిని కోరినట్లే, 'ఈ ఉపకారం నాకు నువ్వు చెయ్యాలి. ఈ రహస్యాన్ని నువ్వు శోభనాద్రికికూడా తెలవనివ్వకూడదు. వాడంటె నాకు నమ్మకం లేకనే నీకు కబురు చేయించాను' అన్నాడు.

'వాడికెందుకు తెలవనిస్తాను?... ఇంక మీరు నిశ్చింతగా ఉండవచ్చు. వ్యవహారమంతా నేను చూసుకుంటాను' అని నమ్మకంగా అన్నాడు వెంకటేశం.

కొన్నాళ్ళయాక గవర్రాజుగారి భార్య కావమ్మగారు శోభనాద్రితో, 'డబ్బుకి చాలా ఇబ్బందిగా వుంది. ఒక్క పాతికరూపాయలు బదులు కావాలి' అని అడిగింది.

'నాదగ్గిర సొమ్ము ఎక్కడిది? అంతే గాకుండా మీరుమాత్రం అప్పుచేసి ఎన్నాళ్లు గడపగలరు? మీ యిల్లు అమ్మేస్తే ఒక వెయ్యిరూపాయలు వస్తుందే. ఆలా చెయ్యకూడదా?' అన్నాడు శోభనాద్రి.

'నాకీ ఆలోచన తోచిందె కాదు. అమ్మేటట్లయితే రాత్రి నిశ్చయించుకు చెబుతాను' అన్నది ఆవిడ. ఈ సంగతి ఇలా ఉండగా, ఆ సాయంత్రమే వారింటికి వెంకటేశం వెళ్లాడు. 'శోభనాద్రి ఇల్లు అమ్మితే వెయ్యి రూపాయలు వస్తుందన్నాడు' అని ఆవిడ ఆ సంగతి అతడితో చెప్పింది. అందుకు వెంకటేశం, 'వెయ్యేమిటి? మీరే అమ్మదలుచుకుంటే నేను పదిహేనువందలిస్తాను' అన్నాడు.

మర్నాడు ప్రొద్దుట మళ్లీ వచ్చిన శోభనాద్రితో కావమ్మ వెంకటేశం సంగతి చెప్పింది.

'నేను రెండువేలిస్తాను' అన్నాడు శోభనాద్రి. పదహారువేల రూపాయలు ముంతలలో వున్న ఇంటిని రెండువేలిచ్చి కొంటే నష్టమేమిటగనుక? మామూలు ప్రకారం ఆ సాయంత్రం వచ్చిన వెంకటేశం రెండు



వేల ఐదువందలవరకూ ఇస్తానన్నాడు. ఈవిధంగా రోజురోజుకీ వాళ్ళిద్దరిమధ్యా పోటీవచ్చి పాట పెరిగింది. ఆఖరికి శోభనాద్రి పదివేలు ఇస్తానన్నాడు. పదహారువేలలో పదివేలు పోతే ఆరువేలున్నాయిగా మరి!

కాపమ్మగారు తెలివితక్కువది కాదు. వెంకటేశం ఇంకా ఏమైనా ధర పెంచుతాడేమో అని చూచింది.

వెంకటేశం ధర పెంచలేదు. శోభనాద్రిని కలుసుకుని, 'ఏమిరా, ఆ యింటికి పదివేలిస్తానన్నావుట! ఏం పాముకుందామని?'' అన్నాడు మండలిస్తూ.

'నువ్వేం పాముకుందామని ధర పెంచావు?' అని ముదలకించాడు శోభనాద్రి.

వాళ్ళు ఒకళ్లనొకళ్ళు చూసి చిరునవ్వు నవ్వుకున్నారు. అసలు రహస్యం వాడి కెలాగో తెలిసిపోయిందని వీడూ, వీడికెలాగో తెలిసిపోయిందని వాడూ గ్రహించారు. ఆఖరికి వెంకటేశం, 'పదివేలు ఎక్కడనుంచి తెస్తావు? బ్యాంకులో నీకు ఐదువేలేకదూ ఉన్నాయి?' అన్నాడు.

'నీకుకూడా బ్యాంకులో ఐదువేలున్నాయిగా? ఆ సొమ్ము నాకు బదులియ్యి. వారంలో తీర్చేస్తాను' అన్నాడు శోభనాద్రి.

'అదేమీ కుదరదు. నీ ఐదువేలూ, నా ఐదువేలూ చేర్చి, ఆ యింటిని మనిద్దరిపైనా రాయించుకుందాం' అన్నాడు వెంకటేశం. 'సరే' అన్నాడు శోభనాద్రి.

అదివరలో గవర్రాజును ద్రోహంచేసి అపహరించిన ఆ పదివేలూ తెచ్చి వాళ్లిద్దరూ కాపమ్మగారి ఒడిలో పోసి, ఇల్లు రాయించుకొన్నారు.

తరువాత వాళ్లిద్దరూ చెరిఒక గునపం చేతపుచ్చుకుని గది మూలలు తవ్వటం మొదలెట్టారు. ఎంత తవ్వినా ఒక్కముంత యినా కనిపిస్తేగా!



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఫిబ్రవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## మార్చి నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో : మెడవంకర | రెండవ ఫోటో : జై-శంకర!

పంపినవారు : పీతాంబరం సీతమ్మ—బారువారి వీధి—అనకాపల్లి (విశాఖపట్టణం జిల్లా)

బహుమతిమొత్తం రూ. 10/- మార్చి సంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది

నేడే చూడండి
దక్షిణ దేశమంతటా 100
థియేటర్లలో విజయవంతంగా
ప్రదర్శింపబడుతున్న

విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్
కె. కామేశ్వరరావు
బి.ఎ.



నిర్మాతలు.... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26. and Published by him for Chandamama Publications, Madras 26, Controlling Editor: 'SRI CHAKRAPANI'

Photo by N. Thyagarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

చెఱువు లేక

పంపినవారు :
ఎస్. ఎస్. ఎస్. రావు - కొంతంగి

LP-2

CHANDAMAMA (Telugu) FEBRUARY 1954 Regd. No. M. 4854




రంగులబొమ్మ కథ — 2 . ప బొమ్మ